శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః



శ్రీవేదాన్తదేశికులు అనుగ్రహించిన

# గీతార్థసంగ్రహమ్



**ఆంధ్ర వ్యాఖ్యానం:**

**పండితరత్న**

ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈయుణ్ణి అప్పంగ శింగరాచార్యులు

**సంపాదకుడు:**

**ఈయుణ్ణి అనంత రంగ రామన్**

**30 జూలై, 2020**

# నివేదన

వడకలై సంప్రదాయంలో నిత్యం అనుసంధించివలసిన ప్రబంధం **'దేశిక ప్రబంధం'**. దీనిని వేదాంత దేశికులు అనుగ్రహించారు. ఇందులో **24** ప్రబంధాలు ఉన్నాయి. అయితే, ప్రస్తుతం మనకు పంతొమ్మిది ప్రబంధాలు మాత్రం లభిస్తున్నాయి. ఇవి అన్నీ చాలా మధురమైనవి. విశిష్టాద్వైత సిద్ధాంత సంప్రదాయాలకు సంబంధించిన ఎన్నో విశేషాలు, రహస్యాలు ఇందులో గోచరిస్తాయి. శబ్దార్థసౌందర్యంలోను, విషయప్రతిపాదనలోను ఈ దేశికప్రబంధం ఆళ్వారుల దివ్యప్రబంధాలతో పోలి ఉన్నది. గీతార్థ సంగ్రహం దేశిక ప్రబంధంలో చేరిన ఒక ప్రబంధం.

దీనిని దేశికులు శ్రీ యామునుల గీతార్థసంగ్రహాన్ని, భగవద్రామానుజుల గీతా భాష్యాన్ని దృష్టిలో పెట్టుకొని రచించారు. ఇందులో మొత్తం ఇరవై ఒక్క పాశురాలు ఉన్నాయి. ఇవి అన్నీ భగవద్గీతలోని సారాన్ని మనకు తెలుపుతున్నాయి. ఈ ప్రబంధం ఇప్పుడు ఆంధ్ర వివరణతో ప్రకాశింప జేయబడుతున్నది. ఈ వివరణ ఉ.వే. శ్రీమాన్ ఒప్పిలియప్పన్ శ్రీరామ దేశికాచార్య స్వామి వారు అనుగ్రహించిన ద్రావిడ వివరణను కృతజ్ఞతా పూర్వకంగా అనుసరించి చేయబడింది. ఇందులోని దోషాలను పాఠకులు మన్నిస్తారని భావిస్తాను. భగవద్గీతకు సంబంధించిన అందమైన వర్ణచిత్రాలను సేకరించి ఈ గ్రంథంలో చేర్చి అందంగా తయారుచేసిన కుమారుడు చిరంజీవి శ్రీమాన్ అనంత రంగ రామన్ కు అనేక మంగళా శాసనాలు. స్వస్తి.

**గీతార్థసంగ్రహవ్యాఖ్యా శింగరార్యకృతా భవేత్,**
**శ్రీదేశికపదాంభోజ భక్తానందప్రదాయినీ.**



భాగవత దాసుడు
ఈ ఏ శింగరాచార్యులు

# విషయ సూచిక

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః



# పాదుత్తనియన్‌లు

1. రామానుజదయాపాత్రం జ్ఞానవైరాగ్యభూషణమ్ ।
శ్రీ మద్వేంకటనాథార్యం వందే వేదాంతదేశికమ్ ॥

భగవద్రామానుజులు, అప్పుళ్ళార్ - అనే ఆచార్యుల దయకు పాత్రమైన వారు, జ్ఞానవైరాగ్యసంపన్నులు, వేంకటేశ్వరఘంటావతారులుగా ప్రసిద్ధులగు వేదాంతదేశికులకు నమస్కరిస్తున్నాను.

2. శీరొన్ఱు తూప్పుల్ తిరువేఙ్గడముడైయాన్
పారొన్ఱ చ్చొన్న పழమొழియుళ్ - ఓరొన్ఱు
తానే యమైయాదో తారణియిల్ వాழ்వార్క్కు
వానేఱ ప్పోమళవుమ్ వాழ்వు.

కల్యాణగుణాలను పొందికగా కలవారు, తూప్పుల్ అగ్రహారంలో శ్రీవేంకటేశ్వరుని ఘంటాంశతో అవతరించినవారైన దేశికులు పల్కిన సూక్తులలో ఒక్కటి అయినా, ఈ జగత్తులో ఉండేవారు పరమపదాన్ని చేరేవరకు కాలక్షేపం చేయడానికి చాలదా? (చాలు)

ఈ రెండు పాదుత్తనియన్‌లను దేశికప్రబంధం అనుసంధాన ప్రారంభంలో చెప్పుకోవాలి.



శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః



# గీతార్థసంగ్రహమ్

## తనియన్ పాశురం

1. కట్టప్పొరుళ్ విరిత్త కాశినియిల్ నాన్ మఱైయిన్
ఇట్టప్పొరుళ్ ఇయమ్బు మిన్ పొరుళై - చ్చిట్టర్ తొழுమ్
వేదాన్తదేశికనై మేవువార్ తజ్గళ్ తిరు
ప్పాదామ్బుయమడియేన్ పఱ్ఱు●

ఈ భూమిలో తెలియడానికి కఠినమైన అర్థాలను వివరించి పలికే నాల్గు వేదాలలోని ఇష్టమైన అర్థాలను తన సూక్తులతో వివరించేవారు, అనుభవించ డానికి భోగ్యవస్తువై ఉన్నవారు, పెద్దలచే నమస్కరింపబడేవారైన వేదాంత దేశికులను భక్తితో ఉపాసించేవారి శ్రీపాదపద్మాలు దాసుడనైన నాకు శరణం (ఆశ్రయం).

2. గీతై మొழிన్దరుళుమ్ వేదాన్తదేశికనార్
పాతారవిన్దమలర్ పఱ్ఱు ●

గీతలోని సారార్థాన్ని తమ గీతార్థసంగ్రహమనే గ్రంథంలో పల్కిన శ్రీవేదాంతదేశికుల శ్రీచరణపద్మాలు అందఱికి శరణం.

# విషయ సంగ్రహం

శ్రీ వైకుంఠంలో శ్రీదేవి, భూదేవి, నీలాదేవులతో పాటు వేంచేసి ఉన్న వాడు, నిత్యులతో, ముక్తులతో కలసి మహామణి మంటపంలో వేంచేసి ఉండి, తన అధికారాన్ని ఏ అడ్డూ లేకుండా నిర్వహించే శ్రీమన్నారాయణుడు, ఈ కర్మభూమిలో సజ్జనుల రక్షణ కోసం, దుష్టులను శిక్షించడం కోసం, ధర్మాన్ని స్థాపించడం కోసం మనసులో నిశ్చయించుకొన్నాడు. ఉత్తర మధురా క్షేత్రంలో శ్రీ కృష్ణుడుగా అవతరించి, అందరు ఆశ్రయించడానికి సులభుడయ్యాడు. తనను శరణు వేడిన పాండవులకు దూత కావడం తనకు గొప్పతనం కలిగిస్తుందని భావించాడు. యుద్ధరంగంలో అర్జునుని నాయకునిగా చేసి తాను అతని రథం తొట్టిలో కూర్చుని, అతనికి సారధి అయ్యాడు. అర్జునుని కేవలం నామమాత్రంగా చేసుకొని తాను శత్రువులను అందరిని వధించాలని



నిర్ణయించుకున్నాడు. దీనిని చూచిన అర్జునుడు తనకు చెందిన బంధువులు, స్నేహితులు యుద్ధంలో నశించడం తప్పదని భావించాడు. అందువల్ల తగని శోకం, కరుణ అతని మనసులో కలిగాయి. తన ఎదురుగానే ప్రాణాలను పోగొట్టుకునే బంధువులను, ఆశ్రితులను చూచి, వారు తనతో యుద్ధం చేయడానికి ముందుకు వచ్చినా, వారితో తాను యుద్ధం చేయడం, వారిని చంపడం పాపానికి కారణం అవుతుంది-అని భయపడి మనసులో చాలా చింతించాడు. ఏమి చేయాలో తెలియని మూఢుడయ్యాడు. యుద్ధం చేయడం క్షత్రియ ధర్మం అయినా యుద్ధాన్ని అధర్మమని భావించాడు. ఈ విధంగా కలత చెందిన అర్జునుడు శ్రీకృష్ణుని శరణు వేడి, శిష్యుడై తనకు మంచిని ఉపదేశించమని ప్రార్థించాడు.

శ్రీకృష్ణుడు అర్జునుని స్థితిని గమనించాడు. అతని దుఃఖాన్ని పోగొట్టాలని అనుకున్నాడు. అతనిని కేవలం వ్యాజంగా చేసికొని భగవద్గీత అనే అమృతాన్ని లోకంలో వర్షించాలి అని అనుకున్నాడు. అర్జునునకు, మొదట, 'శరీరం కంటే వేరే అయినది, భగవంతునకు శేషమై, నిత్యమై ఉండే ఆత్మ స్వరూపాన్ని చక్కగా తెలిసినవాడు మోక్షాన్ని పొందడానికి పరంపరా కారణాలైన కర్మయోగ జ్ఞానయోగాలను', ఆ విధంగానే, 'సాక్షాత్తు కారణంగా చెప్పబడిన భక్తి యోగాన్ని' వాటి అంగాలతో పాటు ఉపదేశించాడు. తరువాత అర్జునుని పరీక్షించాలి అని భావించి "ఇవే మోక్షానికి సాధనాలు, వీటినే ముఖ్యంగా భావించి ఆచరించు'' అని నిశ్చయంగా చెప్పకుండా , "వీటిలో నీకు ఇష్టమైన దానిని ఆచరించు'' అని అని ఊరుకున్నాడు. అప్పుడు అర్జునుడు తనకు నిశ్చితమైన మార్గాన్ని చెప్పకుండా శ్రీకృష్ణుడు తనను ఉపేక్షించాడు అని భావించి, మళ్లీ దుఃఖాన్ని పొందాడు. అప్పుడు అతనిని చూచి శ్రీకృష్ణుడు "తిరిగి మళ్ళీ ఆ భక్తియోగాన్ని స్థిరంగా ఉపదేశించి చూస్తాను'' అని అనుకున్నాడు. అప్పుడు అతడు పూర్వం తాను ఉపదేశించిన భక్తి యోగాన్ని "ఇది అన్ని విధాల చాలా రహస్యమైనది'' అని అంటూ ఉపోద్ఘాతం పూర్వకంగా మళ్లీ అర్జునుడు శ్రద్ధగా వినేటట్లు ఉపదేశించాడు.

భక్తి యోగాన్ని విన్నప్పటికీ అర్జునునకు శ్లోకం తగ్గలేదు, సరిగదా, మరింత

ఎక్కువ అయింది. ఎందుకంటే, భక్తియోగాన్ని దాని అంగాలతో పాటు అనుసరించడం, ఆచరించడం చాలా కష్టం. దానికి జ్ఞానం, శక్తి సంపూర్ణంగా ఉండాలి. చాలాకాలం చాలా జాగ్రత్తగా దాన్ని ఆచరించాలి. ఫలం కూడా త్వరగా సిద్ధించదు. అందువల్ల అర్జునునకు మళ్లీ దుఃఖం కలిగింది. శ్రీకృష్ణుడు అతని దుఃఖాన్ని చూచాడు. తన ఉపదేశానికి అతడు తగిన పాత్రమని భావించాడు. అతని ద్వారా లోకాన్ని కూడా తరింప చేయాలి అని భావించాడు. మోక్షానికి, మిగిలిన అన్ని ప్రయోజనాలకు సాధనమై, తన అంగాలు తప్ప వేరు ఏ విధమైన అంగాలను లేనిదై, మిక్కిలి సులభమైనదై, క్షణకాలంలోనే ఆచరించడానికి వీలైయినదై, చాలా రహస్యమైనది అయిన ప్రపత్తిని చరమ శ్లోకరూపంలో ఉపదేశించాడు. దానిని విన్న అర్జునుడు కలత తీరినవాడై శ్రీకృష్ణుని ఆజ్ఞను శిరసావహించి దాని ప్రకారంగా నడుచుకొని బాగుపడ్డాడు.

ఈ వృత్తాంతమే భగవద్గీతగా అవతరించింది. 18 అధ్యాయాలు కలిగిన ఈ గీత ఉపనిషత్ సారం అని, మహాభారతానికి ప్రాణస్థానం అని పెద్దలు అంటారు. సాక్షాత్తు శ్రీకృష్ణుని ముఖం నుండి వెలువడిన గొప్పతనం దీనికి ఉన్నది. దీని మహిమను ఆవశ్యకతను గుర్తించిన శ్రీ యామునులు, దీనిలోని సారాన్ని పొందుపరచి 'గీతార్ధ సంగ్రహం' అనే ఒక చిన్న రహస్యాన్ని సంస్కృత భాషలో అనుగ్రహించారు. భగవద్రామానుజులు కూడా భగవద్గీత లోని అర్థాన్ని యథాతథంగా తెలిసికొని అందరూ బాగుపడాలి-అని భావించి గీతా భాష్యాన్ని రచించారు. శ్రీ దేశికులు కూడా ఈ భాష్యానికి 'తాత్పర్య చంద్రిక' అనే పేరుతో విశదమైన వివరణ రచించి, అందులో ఇతర మతాల వాదాలను ఖండించి, రామానుజుల వ్యాఖ్యానము శ్రీకృష్ణుని హృదయానికి, వేదాలకు అనుకూలం అని నిరూపించారు. ఆ విధంగానే, గీతార్థ సంగ్రహానికి 'గీతార్ధ సంగ్రహ రక్ష' అనే ఒక అందమైన వ్యాఖ్యానాన్ని కూడా దేశికులు రచించారు. ఇటువంటి గొప్పతనాన్ని, ప్రాధాన్యాన్ని కలిగి వెలిగే శ్రీ భగవద్గీతలోని సారాన్ని ద్రావిడ భాష తెలిసినవారు అందరూ తెలిసికొని బాగుపడాలి అని భావించిన దేశికులు, శ్రీయామునుల సూక్తులను ద్రావిడ భాషలో పాశురాల రూపంలో రచించారు. దానికి 'గీతార్ధ సంగ్రహం' అని పేరు.



## శ్రీగీతాశాస్త్రసారం

★1. కరుమముమ్ ఞానముమ్ కొణ్డెళుమ్ కాదలుక్కోరిలక్కెన్ఱు
అరుమఱై యుచ్చియుళ్ ఆదరిత్తోదుమరుమ్పిరమమ్
తిరుమకళోడు వరుమ్ తిరుమాలెన్ఱుతానురైత్తాన్
తరుమముకన్ఱ తనఞ్జయనుక్కు అవన్ శారదియే ●

ధర్మమార్గంలో ఆసక్తిని కల్గిన అర్జునునకు అతని సారథియైన శ్రీకృష్ణుడు "కర్మయోగాన్ని, జ్ఞానయోగాన్ని సాధనంగా గ్రహించి వృద్ధి పొందే భక్తికి ఒకే లక్ష్యం ఎవరంటే- తెలియడానికి కష్టమైన వేదంలో కీర్తింపబడేవాడు, పొందడానికి దుర్లభుడైన పరమాత్మ, ఎల్లప్పుడు లక్ష్మితో ప్రకాశించే శ్రీమన్నారాయణుడే" అని తానే స్వయంగా తెలిపాడు.

**వ్యాఖ్యానం:** ప్రారంభంలో కర్మయోగాన్ని ఆచరించి మనసును వశం చేసుకొని, తరువాత జ్ఞాన యోగాన్ని ఆచరించి, దాని వల్ల ఆత్మసాక్షాత్కారాన్ని పొంది, ఆ తర్వాత భక్తి యోగాన్ని ఆచరించాలి-అనే విషయాన్ని "కరుమముమ్ జ్ఞానముమ్ కొణ్డెళుమ్ శాదనుక్కు" అనే ప్రయోగం తెలుపుతున్నది.

వేదాంతాలన్నీ "ఇటువంటి భక్తి యోగానికి లక్ష్యంగా ఉండేవాడు శ్రీమన్నారాయణుడు అనే పరబ్రహ్మ మాత్రమే" అని తెలుపుతున్నవి. ధర్మంలో దృఢమైన దృష్టిని కల అర్జునునకు శ్రీకృష్ణుడు తానే అటువంటి పరతత్వం అని పలికి తెలియజేశాడు-అని ఇక్కడ భావం.

శ్రీ భగవద్గీతలోని 18 అధ్యాయాలు మూడు భాగాలుగా, అంటే, ఆరు, ఆరు, ఆరు అధ్యాయాలను కల భాగాలుగా పెద్దలు విభాగించారు. మొదటి షట్కంలో కర్మయోగ, జ్ఞాన యోగాలు, రెండవ భాగంలో భక్తియోగం, మూడవ భాగంలోని మొదటి భాగంలో చేతనాచేతన రూపమైన ఈ ప్రపంచం, దాని స్వరూప స్వభావాలు, భగవంతుని యథార్థ స్థితి, తరువాత భాగంలో కర్మ యోగ, జ్ఞాన యోగ భక్తి యోగాలను ఆచరించే క్రమం, శాస్త్రవశ్యత మొదలైనవి ప్రధానంగా నిరూపించబడ్డాయి.



పార్థసారధి పెరుమాళ్ - తిరువల్లిక్కేణి

ఈ పాశురంలో "కరుమముమ్ జ్ఞానముమ్ "అని అనడం వల్ల మొదటి షట్కం లోని అర్థం "కాదలుక్కు'' అని అనడం వల్ల రెండవ భాగంలోని అర్థం, "అరుమ్ పిరమమ్'' అని అనడం వల్ల చేతనాచేతనాల కంటే విలక్షణమైన ఉండే బ్రహ్మం చెప్పబడ్డంవల్ల మూడవ భాగంలోని ముందు భాగంలో అర్థం, ఆ విధంగానే,'' తరుమ ముకంద'' అని అనడం చేత శాస్త్రవశ్యత తెలియజేయడం ద్వారా తరువాత భాగంలోని అర్థం సూచింపబడ్డాయి.

## ప్రథమాధ్యాయ సారవివరణం

2. ఉకవైయడైన్ద ఉఅవుడైయార్ పొరలుశిర్ఱ అన్నాళ్
తకవుడనన్బు కరైపురళ త్తరుమ త్తళవిల్
మిక వుళమఞ్జివిழுన్దడిశేర్న్ద విశయనుక్కు ఓర్
నకైయుడ ఉణ్మైయురైక్క అమైన్దనన్ నారణనే ●

ప్రేమను కల బంధువులు యుద్ధానికి సిద్ధమైన ఆ సమయంలో వారిపై కరుణతో ప్రేమ పొంగి పొర్లగా, ధర్మాన్ని గూర్చిన జ్ఞానంలో అర్జునుని మనస్సు చాలా భయపడింది. అపుడు, తన శ్రీపాదాలలో పడి శరణు పొందిన అర్జునునకు శ్రీకృష్ణుడై అవతరించిన శ్రీమన్నారాయణుడు సాటి లేని చిఱునవ్వుతో ఆత్మల యాథాత్మ్యాన్ని ఉపదేశించగా, అతడు ఆశ్వాసాన్ని పొంది నిలచాడు.

**వ్యాఖ్యానం:** భీష్ముడు మొదలైన బంధువులు, ద్రోణుడు మొదలైన ఆచార్యవర్గం తమ విషయంలో చాలా ప్రీతి కలవారై ఉన్నారు. వారే ఇప్పుడు తమను ఎదిరించి యుద్ధం చేయడానికి యుద్ధ రంగానికి వచ్చి ఎదురుగా నిలవడం అర్జునుడు గమనించి చూచాడు. వాస్తవానికి ప్రేమకు, కరుణకు యోగ్యులు కాని వారిపై అర్జునునకు ప్రేమ, కరుణ కలిగింది. అందుచేత క్షత్రియులకు గొప్ప ధర్మం అయిన యుద్ధాన్ని అధర్మం అని భావించాడు. భయపడ్డాడు. శత్రువులై యుద్ధరంగంలో ఎదురు నిలిచిన వారిని ఎదిరించడానికి మానసికంగా సిద్ధపడలేదు. తన వింటిని, బాణాలను కింద పడవేశాడు. రథం కిందకు దిగి కూర్చున్నాడు. తరువాత శ్రీకృష్ణుని ప్రార్థించి తనకు హితాన్ని ఉపదేశించమని ప్రార్థించాడు. శ్రీకృష్ణుడు అప్పుడు చిరునవ్వు నవ్వుతూ, జీవాత్మ-పరమాత్మల స్వరూపాన్ని, భగవంతుని చేరడానికి తగిన ఉపాయం మొదలైన సకల వేద వేదాంతాల సారార్థాన్ని చాలా మధురంగా, సులభంగా అర్థం చేసికొనేటట్లు అర్జునునకు బోధించాడు.

## ద్వితీయాధ్యాయసారవివరణం

3. ఉడలమ*ళ్రి*న్దిడుముళ్ళుయిరొన్ఱ*ళ్రి*యాదెనైప్పోల్
విడుమదుప*ఱ్ఱు* విడాదతడైత్త కిరిశైకళే
కడుక ఉనక్కుయిర్ కాట్టుమ్ నినైవ దనాలుళదామ్
విడు మయలెన్ఱు విశయనై *త్తేఱ్ఱి*నన్ విత్తకనే ●

ఆశ్చర్యకరచేష్టలను కల శ్రీకృష్ణుడు - "శరీరం నశించి పోతుంది, శరీరంలో ఉండే జీవాత్మ అనే వస్తువు పరమాత్మ అయిన నావలె నాశం పొందకుండా ఉంటాడు. ఫలం మొదలైనవానిలో సంగాన్ని విడచిపెట్టడం తగినది. సంగం లేకుండా చేసిన ఆ కర్మయోగంతో ఆత్మస్వరూపాన్ని దర్శింపజేయగల్గిన జ్ఞానయోగం త్వరగా నీకు సిద్ధిస్తుంది. మోహాన్ని విడచిపెట్టు'' అని అర్జునునకు ద్వితీయాధ్యాయంలో తెలిపాడు.

**వ్యాఖ్యానం:** (ఉడల్ ...ఎనై ప్పోల్) అర్జునా! సర్వేశ్వరుడనైన నేను నాశనం లేని వాడను, నిత్యుడను నా వలె ఆత్మ కూడా నాశనం లేనిది, నిత్యమైనది. ఈ విషయంలో కొంచెం కూడా సందేహం లేదు. అయితే, "మరణించాడు, జన్మించాడు" అని అనడం ఏవిధంగా పొసగుతుంది?'' అని అడగవచ్చు. కానీ ఈ సందేహానికి అవకాశం లేదు. బాల్యం, కౌమారం, యవ్వనం, వార్ధక్యం మొదలైన దశలలో ఒక దశ నుండి ఇంకొక దశకు జీవుడు చేరేటప్పుడు అతడు మరణించాడని ఎవరూ అనుకోవడం లేదు. దుఃఖించడం లేదు. దానికి కారణం ఏమి? అంటే, ఆత్మ మరణించదు, నాశనం పొందదు-అనే నిశ్చయమే కదా. ఈ విధంగానే జీవుడు ఒక శరీరాన్ని విడిచిపెట్టి ఇంకొక శరీరంలో ప్రవేశించడమే మరణమని చెప్పబడుతున్నది. అందువల్ల ఆత్మ నిత్యం అని తెలిసిన వాడు ఎవడూ చింతించడు. ఆత్మ ఆయుధాల చేత వధించడానికి వీలుకానిది. అగ్నిచే దహించ వీలుకానిది. నీటితో తడపడానికి వీలుకానిది. ఆత్మ నాశనం లేనిది. అంతటా ప్రవేశించి సంచరించగలిగిన అణు స్వరూపాన్ని కలిగినది. ఇటువంటి ఆత్మను వధించడానికి వీలు కాదు. ఆత్మను చంపాలని ఎవరైనా అనుకోవడం

కాని, ఆత్మవధింపబడినది అని భావించడం గాని అజ్ఞానమే అవుతుంది. లోకంలో మరణించడం అనేది - నిత్యమైన ఆత్మ ఒక శరీరం నుండి విడచి వెళ్ళిపోవడమే. ఇప్పుడు యుద్ధంలో నీ చేత చంపబడే శత్రువుల ఆత్మలు స్వర్గలోకానికి చేరి, విడచిన శరీరాల కంటే గొప్ప రూపాలను పొంది, ఉన్నతమైన సుఖాలను అనుభవించబోతారు. కనుక నీవు ఆనందపడటమే సరి అయిన క్రమం. పాత బట్టలను విడిచిపెట్టి కొత్త బట్టలు ధరించడం ఎవరికీ దుఃఖాన్ని కలిగించదు కదా.



జీవుడు నశించకపోయినా శరీరం నశిస్తున్నది అని ఒకవేళ దుఃఖ పడుతున్నావా? అది కూడా సరి అయినది కాదు. నీ శరీరం పంచభూతాల కలయిక. నిత్యుడైన జీవుడు తాను చేసిన కర్మల ఫలితాలను అనుభవించడానికి తగిన స్థానం ఇది. అందువల్ల కర్మ తీరి పోగానే శరీరం కూడా తొలగిపోతుంది.

శరీరం ఎల్లప్పుడూ పరిణామాన్ని పొందడమే దాని సహజ స్వభావం. యుద్ధంలో నీవు వీరిని చంపకపోయినా కొన్నాళ్ళకు వీరి శరీరాలు తప్పక నశిస్తాయి. అందుచేత 'శరీరం నశిస్తున్నదే!' అని ఎవరూ బాధ పడనక్కరలేదు.

(విడువదు...కిరిశైకళే) శాస్త్రాల సహాయంతో ఆత్మ స్వరూపాన్ని చక్కగా గ్రహించి, తరువాత కర్మలను చేసేటప్పుడు వాటి ఫలాలతో సంబంధాన్ని కలిగి ఉండకుండా, వాటిని భగవంతునకు చేసే సేవల రూపంగానే భావించి చేయాలి. చేసే కర్మలలో ఫలసంగాన్ని మాత్రం విడిచి పెట్టాలి తప్ప, చేయమని విధింపబడిన కర్మలను ఏ నాడు విడువకూడదు. యుద్ధం అనేది క్షత్రియ కర్తవ్యం. న్యాయమైన యుద్ధం కంటే క్షత్రియునకు మంచిని కలిగించే పని ఇంకొకటి లేదు. అందుచేత నీవు ఫలితాన్ని ఆశించకుండా "యుద్ధం కర్తవ్యం" అని భావించి, దానిని భగవంతుని కైంకర్యంగా భావించి న్యాయమైన యుద్ధం అనే కర్మయోగాన్ని చేస్తే, చివరికి నీవు మోక్షాన్ని పొందగలవు.

(కడుక...ఉళదామ్) ఇటువంటి కర్మ యోగం ద్వారా మనసు వశం చేసికొన్న తరువాత, భగవంతునకు శరీరమై ఉండే ఆత్మయొక్క స్వరూపాన్ని నిరంతరం చింతించడం అనే జ్ఞానయోగం సిద్ధించి, ఆ తరువాత ఆత్మ స్వరూపం సిద్ధిస్తుంది. అందుచేత ఆత్మ స్వరూపాన్ని, యుద్ధమనే కర్మయోగం ఆత్మ స్వరూపానికి సాధనమని తెలిసికొని, **శరీరమే ఆత్మ అనే అజ్ఞానాన్ని పోగొట్టుకో** .

ఈ విషయాలను రెండవ అధ్యాయంలో శ్రీకృష్ణుడు అర్జునునకు ఉపదేశించాడు-అని ఇక్కడ తాత్పర్యం. రథంలో సారథిగా నిలచి ఉన్నప్పుడే ఆచార్యుడుగా కూడా నిలచి శ్రీకృష్ణుడు ఉపదేశించిన ఆశ్చర్యకరమైన లీలను భావించి "విత్త కన్" అని ప్రయోగింపబడినది.

## తృతీయాధ్యాయసారవివరణం

**4. శఙ్గమ్ తవిర్న్దు శకఙ్గతిర్ పెర్ఱ తనఙ్జయనే**
**పొఙ్గుమ్ కుణఙ్గళ్ పుణర్ప్పనైత్తుమ్ పుకవిట్టవర్ఱుళ్**
**నఙ్కణ్ణురైత్త కిరిశైయెలామ్ ఎనవుమ్ నవిన్రార్**
**ఎఙ్గుమ్ మఱివర్కళే యెన్రు నాద నియమ్బిననే ●**

సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుడు "లోకంలో గొప్పతనాన్ని కల అర్జునా! కర్మలలో, వాని ఫలాలలో సంగాన్ని విడచి, మాటిమాటికి వృద్ధి చెందే సత్త్వరజస్తమస్సులనే మూడు గుణాలవల్ల కలిగే కర్మలన్నిటిని, ఆ గుణాలలో ఆరోపించి, శాస్త్రాలలో విధింపబడిన కర్మలన్నిటిని ఈశ్వరుడనైన నావద్ద సమర్పించాలి - అని దీనిని అనుసంధించిన పెద్దలు అన్ని విషయాలనూ తెలిసినవారే - అని ఉపదేశించాడు.

**వ్యాఖ్యానం:** (శఙ్గమ్...తనంజయనే) ముందు కర్మయోగాన్ని ఆచరించి మనసును వశం చేసుకొని, ఆ తర్వాత జ్ఞాన యోగాన్ని ఆచరించాలని చెప్పబడింది. జ్ఞానయోగాన్ని సాక్షాత్తు చేయడానికి అధికారం ఉండేవాడు కర్మ యోగాన్ని ముందు ఎందుకు ఆచరించి తీరాలి? - అనే ప్రశ్న ఇక్కడ కలుగుతుంది. దానికి సమాధానం ఈ విధంగా చెప్పవచ్చు. కర్మయోగాన్ని ముందు చేయకపోతే జ్ఞానయోగం అనేది సిద్ధించదు. ఫల సంగం లేకుండా కర్మయోగాన్ని చేసి, భగవంతుని ప్రేమను పొందాలి. దానివల్ల ఆశ, ద్వేషం మొదలైన దోషాలు మనస్సునుండితీరిపోతాయి. ఆ తరువాత ఇంద్రియాలు స్వాధీనం అవుతాయి. దానివల్ల జ్ఞానయోగం సిద్ధిస్తుంది. ఈ క్రమంలో కాక, నేరుగానే జ్ఞాన యోగాన్ని చేయాలని ఆరంభించడం ఏడు అంతస్తులను కల ఒక గోపురాన్ని కట్టదలచి, మొదట్లోనే ఏడవ అంతస్తును కట్టడానికి ప్రయత్నించే రీతిలో పరిహాసానికి కారణం అవుతుంది.

ఇంతే కాదు. ప్రళయంలో తప్ప మిగిలిన ఏ సమయంలోనూ ఎవడు కూడా ఏ పనీ చేయకుండా క్షణం కూడా ఉండలేడు. **"న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్"**. జీవుడు తన ప్రయత్నం లేకుండానే సత్త్వాది గుణాల కారణంగా ఏ పని అయినా చేయడానికి ప్రేరణను పొందుతున్నాడు.

కర్మయోగం ఆచరించడానికి సులభమైనది. ఇందులో సాధారణంగా తప్పులు సంభవించవు. ఏ పనినీ చేయకుండా ఊరికే ఉండడం సాధ్యం కాదు. కర్మయోగాన్ని విడిస్తే జీవన యాత్ర కూడా అసాధ్యం. జ్ఞాన యోగానికి యోగ్యులైన జనకుడు మొదలైన మహానుభావులు కూడా కర్మయోగాన్ని ముందు ఆచరించారు. అంతేకాక, నీవు లోకంలో చాలా గొప్ప వాడవు అనే పేరును పొందావు. నీవు కర్మయోగాన్ని చేయకుండా విడచి పెడితే నిన్ను చూసి జ్ఞాన యోగానికి అధికారం లేని వారు కూడా కర్మయోగాన్ని చేయడం మాని జ్ఞాన యోగాన్ని ఆరంభించి, దానిని వారు పూర్తి చేయలేక పాడైపోతారు. ఆ పాపం నీకు చుట్టుకుంటుంది. దానివల్ల నువ్వు జ్ఞానయోగం నుండి భ్రష్టడవు అవుతావు.



(శంగమ్ తవిర్ న్దు) కర్మయోగాన్ని చేసేటప్పుడు కూడా భగవంతుని ఆనందం తప్ప స్వర్గము మొదలైన ప్రయోజనాలను కోరకూడదు.

(పొంగుమ్...అవ*ఱ్ఱుళ్* పుకవిట్టు) సత్వం, రజస్సు, తమస్సు అనే మూడు ప్రకృతి యొక్క గుణాలు. జీవుని శరీరంలో ఈ మూడు ఒక్కొక్కసారి పెరిగి, ఒక్కసారి తగ్గుతూ ఉంటాయి. ఈ గుణాలు కొన్ని పనులను చేస్తాయి. వీటి వివరం పద్నాలుగవ అధ్యాయంలో చూడవచ్చు. జీవుడు గుణాలు చేసే కార్యాలను తాను చేస్తున్నట్లు అనుకుంటాడు. దీనికి కారణం ఏమంటే, శరీరమే ఆత్మ అని భావించడం. ఈ విధంగా కాకుండా, ఆత్మ స్వరూపాన్ని యథార్థంగా తెలిసినవాడు అటువంటి కార్యాలను చేసే స్వభావం ఆత్మకు సహజంగానే కలిగింది అని, సత్వం మొదలైన గుణాల సంబంధం వల్ల ఏర్పడిందని గ్రహించి, కార్యాలను తటస్థంగా చేయాలి. దీనినే 'గుణాలలో కర్తృత్వాన్ని అనుసంధించడం' అని అంటారు.

(నంగళ్...అటివర్ కళే) ఇటువంటి కర్మలు అన్నీ భగవంతునిచే చేయబడుతున్నాయి.అని, భగవంతుడు తనకు దాసుడైన జీవుని ద్వారా తన సాధనాలతో తాను సంతోషించడం కోసం తన కర్మలను తానే చేయించుకున్నాడని భావించి., కార్యాలను చేయాలి .ఇటువంటి అనుసంధానం కలవారు సకల శాస్త్రాల సారాన్ని బాగా తెలిసిన వారు అవుతారు. .

ఈ విధంగా కర్తవ్యం అయిన యుద్ధాన్ని చేయమని శ్రీకృష్ణుడు అర్జునునకు ఉపదేశించాడు ఇక్కడ తాత్పర్యం.

## చతుర్థాధ్యాయ సారవివరణం

5. పిఱవామై తన్నిడ త్తానే పిఱక్కుమ్ పెరుమైకళుమ్
తుఱవా క్కిరిశైకళ్ తూమతితన్నాల్ తులఙ్గుకైయుమ్
ఇఱవా ఉయిర్ నన్నిలై కణ్డిడు ముఱకిన్ నిలైయుమ్
మఱైవాణ్ణు మాయవన్ నేయనుకణ్ణఱివిత్తననే ●

వేదంలో కీర్తింపబడి ప్రకాశించేవాడు, ఆశ్చర్యకరచేష్టితుడైన భగవానుడు తన స్నేహితుడైన అర్జునునకు - తనను ఆశ్రయించినవారికి మఱు జన్మ లేకుండా చేయడంకోసం సర్వేశ్వరుడైన తానే కర్మభూమిలో పుట్టినందున తనకు కల్గిన గొప్పతనాలను గూర్చి, విడచి పెట్టడానికి వీలు లేని కర్మలను గూర్చి, పరిశుద్ధమైన ఆత్మ స్వరూపానికి చెందిన జ్ఞానంతో జ్ఞానయోగం ప్రకాశించ డాన్ని గూర్చి, నాశం లేని ఆత్మయొక్క మంచి స్వభావాన్ని తెలిసిన అధికారుల గొప్పతనాన్ని గూర్చి - భారతయుద్ధంలో తెలిపాడు.

**వ్యాఖ్యానం:** (పిఱవామై ...పెరుమైకళుమ్) సత్పురుషులు అయిన సంసారులు ఈ కర్మభూమిలో మాటిమాటికి పలు జన్మలను ఎత్తి బాధపడకుండా ఉండేటట్లు చేయాలని భావించి భగవంతుడు తాను ఎన్నో అవతారాలను ఎత్తి వారిని తరింప చేస్తాడు. ఆ స్వామి అవతార రహస్యాన్ని తెలిసినవారు తిరిగి జన్మను పొందరు. మోక్షాన్ని పొందుతారు. భగవంతుని అవతార రహస్యాన్ని సంగ్రహంగా ఈ క్రింది విధంగా అనుసంధించుకోవచ్చు.

1) భగవంతుని అవతారాలు ఇంద్రజాలాలవలె అసత్యాలు కావు. యథార్థాలు.

2) మన జ్ఞానం ఈ కర్మభూమిలో సంకోచాన్ని పొందినట్లుగా భగవంతుని జ్ఞానం ఈ లోకంలో అతడు అవతరించిన సమయంలో సంకోచాన్ని పొందదు. అతడు తనకు సహజంగా ఉండే జన్మరాహిత్యం, నాశరాహిత్యం, సర్వేశ్వరత్వం మొదలైన స్వభావాలను విడచిపెట్టకుండానే అవతరిస్తాడు.

3)ఇక్కడ అవతరించిన భగవంతుని దివ్యమంగళరూపం మన

శరీరాలవలె సత్త్వ రజస్తమస్సులు అనే మూడు గుణాలతో ఏర్పడినది కాదు. శుద్ధసత్త్వ మయమైనది.

4)ఆ స్వామి జన్మ మన జన్మవలె కర్మల వలన సంభవించదు. భగవంతుని సంకల్పం వల్ల ఏర్పడుతుంది.

5) భగవంతుని జన్మ మన జన్మలవలె కర్మ పరిపక్వం అయ్యే సమయంలో ఏర్పడదు. మరి ఎప్పుడు ఏర్పడుతుంది? అంటే, వర్ణాశ్రమ ధర్మాలు నశించి అధర్మం తల ఎత్తినపుడు సంభవిస్తుంది.

6) ఆ స్వామి అవతారానికి ఫలం సుఖదుఃఖాలను అనుభవించడం కాదు. భగవంతుని దర్శించలేకపోతే క్షణం కూడా ప్రాణాలను నిలుపుకోలేక, అతనిని దూరమైన క్షణం కూడా వేయి కల్పాలుగా భావించి, అన్ని అంగాలలో ఆర్తిని పొంది, ప్రాణాలను విడవడానికి కూడా సిద్ధపడే పరమ భక్తులు తన రూపాన్ని దర్శించి, లీలలను దర్శించి ఆనందించేటట్లు చేసి, వారి ప్రాణాలను రక్షించడం, వారికి శత్రువులైన దుర్మార్గులను సంహరించడం, ధర్మాన్ని స్థాపించడం అనేవి అవతార ఫలాలు.

ఈ విధంగా ఈ 6 విషయాలు అవతార రహస్యం అనబడతాయి.

(తుఅవా....తులంగుక్కైయుమ్) కర్మలను విడిచి పెట్టడం అనేది ఎవరికీ కూడా సాధ్యం కాని పని-అని ఇంతకుముందే వివరింపబడింది. ఇటువంటి కర్మలను ఫలసంగ రహితంగా చేయాలి. ప్రకృతి సంబంధం తీరి, పరిశుద్ధమైన ఆత్మస్వరూపాన్ని అనుసంధించేవాడు సత్త్వాది గుణాల కారణంగా చేయబడే కర్మలలో తనను కారణంగా భావించడు. అంతేకాక, ప్రకృతి చెందిన గుణాలైన సత్త్వం మొదలైనవానిని, చిక్కిపోవడం, లావు కావడం, తెలుపు, నలుపు మొదలైన శరీర ధర్మాలను ఆత్మకు చెందినవిగా భావించడు. ఇటువంటి అధికారి ప్రకృతి సంబంధంలేని ఆత్మ స్వరూపాన్ని అనుసంధించుకొంటూ కర్మలను ఆచరిస్తాడు. అందువల్ల కర్మయోగం ఆత్మజ్ఞానాన్ని తనలో కలిగి ఉన్నందున జ్ఞానయోగం కూడా అవుతున్నది. ఇంతేకాక , మోక్షాన్ని కోరేవాడు తాను చేసే



అన్ని కర్మలను పరబ్రహ్మ రూపంగానే భావించి చేయాలి. అందువల్ల కర్మయోగం జ్ఞానస్వరూపం అవుతున్నది.

"కిరిశైకళ్" అనే బహువచనం వల్ల తన జ్ఞానానికి, శక్తికి, కోరికకు తగినట్లు ముఖ్యమైనవి, ఆచరించే కర్మ యోగంలోని ప్రకారాలుగా అయిన దేవతారాధన, ఇంద్రియనిగ్రహం, ప్రాణాయామం, యాగం, దానం, హోమం, తపస్సు, పుణ్యతీర్థ నివాసం, పుణ్యక్షేత్రాలను సందర్శించడం, వేదానుసంధానం, వేధార్థాలను అనుసంధించడం మొదలైనవి తెలుపబడ్డాయి.

(ఇఱవా ఉయిర్...నిలైయుమ్) పూర్వం తెలిపిన ఈ విధంగా

జ్ఞానయోగంగా కూడా అవుతున్న కర్మయోగంలో కర్మ అనేది ఒక అంశం, జ్ఞానం అనే ఇంకొక అంశం ఉన్నదని తెలుస్తున్నది. ఈ రెండు అంశాలలో జ్ఞానమే ప్రధానము ఎందుకంటే - జ్ఞానాశం ప్రతి దినం అభ్యాసం చేయగా చేయగా స్థిరపడి ఆత్మను సాక్షాత్కరించుకొనేటట్లు చేస్తుంది. ఈ ఆత్మసాక్షాత్కారం పొందినవానికి అహంకారం, మమకారం నశిస్తాయి, ఆత్మ లన్నిటి స్వరూపం జ్ఞానస్వరూపమై ఉండడంవల్ల అవి సమానమైనవి అని, ఆ విధంగానే, పరమాత్మ స్వరూపం జీవాత్మ స్వరూపం సమానమనే జ్ఞానం కలుగుతుంది. ఇటువంటి అధికారి ఆత్మజ్ఞానం అనే నావతో అనాది కాలంగా తాను చేసిన అంతులేని పాపాలు అనే సముద్రాన్ని దాటుతున్నాడు. పెద్ద అగ్ని కాష్ఠాలను దగ్ధం చేసేటట్లు, ఆత్మజ్ఞానం జీవుని పుణ్య పాపాల రూపంలోని అన్ని కర్మలను నశింపజేస్తుంది. ఈ విధంగా ఇతని గొప్పతనం అంతులేనిది.

ఈ విషయాలను, విచిత్రాలైన అవతారాలతో చాలా గొప్ప తనం కలవాడని వేదాంతాలలో వర్ణింపబడిన శ్రీకృష్ణుడు తనకు స్నేహితుడైన అర్జునునకు నాలుగవ అధ్యాయంలో ఉపదేశించాడు.

## పంచమాధ్యాయసారవివరణం

6. కణ్డెళితామ్ కరుమమ్ ఉయర్కాట్టుమ్ కడుకుతలుమ్
మణ్డియదన్ పడియిల్ మనమ్ కొళ్ళుమ్ వరిశైకళుమ్
కణ్డటియా వుయిరై క్కాణలుఱ్ఱ నినైవుకళుమ్
వణ్డువరేశనియమ్బినన్ వాశవన్ మైన్దనుక్కే ●

సమృద్ధిని కల ద్వారకకు నాయకుడైన శ్రీకృష్ణుడు ఇంద్రపుత్రుడైన అర్జునునకు - శాస్త్రాలద్వారా తెలిసికొని, అనుష్ఠించడానికి సులభమైన కర్మయోగం, ఆత్మను దర్శించడానికి త్వరపడడం, ఆ కర్మయోగ ప్రకారాలలో ఆసక్తిని పొంది మనస్సులో భావించవలసిన జ్ఞాన ప్రకారాలు, సాక్షాత్తు దర్శించ డానికి సాధ్యం కాని జీవాత్మ స్వరూపం, అంతటా జ్ఞానస్వరూపంగా దర్శించే

రీతిలో పరిపక్వమైన జ్ఞానాలు - అనే వీటిని గూర్చి ఉపదేశించాడు.

**వ్యాఖ్యానం:** (కండెళిదామ్...కడుకుదలుమ్) కర్మ యోగం అనేది జ్ఞానయోగం వలె కాకుండా ఆచరించడానికి చాలా సులభమైనది. ఫలాన్ని త్వరగా ఇస్తుంది. ఏ విధంగా అంటే - కర్మయోగానికి అధికారి అయినవాడు ఒకడు శాస్త్రాలలో విధింపబడిన, భగవానునకు సంతోషాన్ని కలుగజేసే కర్మయోగాన్ని చేయడానికి ప్రయత్నం చేస్తున్నాడు. అందువల్ల అతనికి రజోగుణం, తమోగుణం నశించి



ఆశ, ద్వేషం మొదలైన దోషాలు తీరిపోతున్నాయి. దానివల్ల అతని మనస్సు తేటపడుతున్నది. పూర్వం ఆచరించి అలవాటుపడిన కర్మ యోగంలో అతడు మనసును నిలపడంచేత అది స్వాధీనం అవుతున్నది. దానివల్ల ఇంద్రియాలు కూడా స్వాధీనం అవుతున్నాయి. తరువాత ఆత్మ యొక్క నిజమైన స్వరూపాన్ని తెలిసికొన్న ఇతనికి "జ్ఞాన స్వరూపమైన అన్ని ఆత్మలు ఒకే విధమైనవి" అనే

విషయంలో నిశ్చయం కలుగుతున్నది. ఈ విధంగా తెలిసికొని, మిక్కిలి సులభమైన కర్మయోగాన్ని చేసేవాడు త్వరగా ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతున్నాడు, అయితే, జ్ఞానయోగం అనేది దానిని చేసేవారికి చాలా కఠినమై, చిరకాలం తరువాత ఫలాన్ని ఇస్తున్నది.

(మండి...వరిశైకళుమ్) నేత్రం మొదలైన జ్ఞానేంద్రియాలు, వాక్కు మొదలైనవి కర్మేంద్రియాలు, ప్రాణ వాయువులు శరీరంలో ఉండి ఆయా కార్యాలను చేసేటప్పుడు, జీవాత్మ అయిన తనను ఆయా పనులను చేసేవానినిగా భావించక, కర్మవల్ల ఏర్పడిన ఇంద్రియాలు, ప్రాణవాయువు అనే వీని సంబంధంచేతనే జీవునకు వానిని చేసే స్వభావం కలుగుతున్నదని భావించాలి. జ్ఞానస్వరూపుడైన జీవునకు సహజంగా ఆ స్వభావం లేదని తెలియాలి.

(కండఱియా..నినైవుకళుమ్) జీవుడు ఆచార్యుని ఉపదేశం ద్వారా ఆత్మస్వరూపాన్ని స్పష్టంగా తెలిసి కోవాలి. ఆ తరువాత ఆ స్వరూపజ్ఞానం వంట పట్టడం వల్ల శరీరమే ఆత్మ అని భావించే విపరీత జ్ఞానం నశిస్తుంది. ఆత్మ సాక్షాత్కారాన్ని పొందాలని నిశ్చయించుకొని, లోకంలో తనకు ఇష్టమైన దానిని పొందినప్పుడు ఆనందించడం, ఇష్టం లేనిది పొందినప్పుడు దుఃఖపడడం అనేవి చేయకుండా ఉండాలి. ఈ విధంగా ఉండే అధికారి - చక్కగా విద్యను అభ్యసించిన విద్యావినయ సంపన్నుని విషయంలో, సాధారణ బ్రాహ్మణుని విషయంలో, పశువు విషయంలో, ఏనుగు విషయంలో, శునకం విషయంలో, దానిని తినే చండాలుని విషయంలో ఆత్మస్వరూపాన్ని దర్శించేటపుడు, అన్ని ఆత్మలను సమంగా దర్శించాలి. ఆయా శరీరాలు వేరు వేరుగా ఉన్నా, పరిశుద్ధమైన ఆత్మ స్వరూపం అన్నిచోట్ల జ్ఞాన స్వరూపమై ఉన్నందున సమానమే అవుతుంది.

ఈ విషయాలను శ్రీకృష్ణుడు అర్జునునకు ఐదవ అధ్యాయంలో ఉపదేశించాడు.

## షష్ఠాధ్యాయ సారవివరణం

7. యోకముయఱ్చియుమ్ యోకిల్ శమనిలై నాల్వకైయుమ్
యోకి నుపాయముమ్ యోకుతనాల్ వరుమ్ పేఱుకళుమ్
యోకు తనిల్ తన్తిఱముడై యోకుతన్ ముక్కియముమ్
నాకణైయోగి నవిష్టనన్ నమ్మడి వీరనుక్కే ● (332)

ఆదిశేషుడనే శయనంలో యోగనిద్రను పొందే భగవానుడైన శ్రీకృష్ణుడు గొప్ప కిరీటాన్ని కల, వీరుడైన అర్జునునకు - జీవాత్మను గూర్చిన యోగాభ్యాస ప్రకారాన్ని, యోగంలో సమంగా దర్శించే స్వభావంలోని నాల్గు దశలను, యోగసాధనాలను, యోగంద్వారా కలిగే ఫలాలను, పైన తెల్పిన నాల్గు దశలను కల యోగం కంటే తనను ఉద్దేశించి చేయబడే భక్తియోగంలోని ముఖ్యత్వాన్ని ఉపదేశించాడు.

**వ్యాఖ్యానం:** (యోగ ముయఱ్చియుమ్) కర్మయోగాన్ని చేయాలని అనుకునేవాడు ప్రతి దినం యోగాన్ని చేయడానికి విధింపబడిన కాలంలో మనసును ఆత్మలో లగ్నం చేసి యోగాన్ని ఆరంభించాలి. జనసమ్మర్దం లేని చోట, నిశ్శబ్దమైన స్థలంలో ఏకాంతంగా ఉండి, ఏ విధమైన మనస్తాపాలు లేకుండా, ఆత్మను తప్ప ఇంక దేనిని భావించకుండా, యోగాభ్యాసం చేయాలి. ఏ వస్తువును తనది అనే భావించే స్వామిత్వాన్ని కలిగి ఉండరాదు. పాషండుడు, పతితుడు మొదలైన దుష్టులు ఉండేచోట గాని, వారి మాట చెల్లునట్టి చోట కానీ యోగాన్ని ఆచరించుట కూడదు. యోగాభ్యాసం చేసే చోటు సహజంగానే పరిశుద్ధంగా ఉండాలి. కొయ్యలు మొదలైన వానితో చేయబడి, కదలకుండా ఉండే ఆసనాన్ని దృఢంగా భూమిలో అమర్చుకోవాలి. మెత్తగా ఉండేటట్లు దానిపై ఒక వస్త్రాన్ని పరచుకోవాలి. ఆ వస్త్రం చుట్టుకొని పోకుండా ఉండడం కోసం, పరిశుద్ధంగా ఉండడం కోసం దానిపై జింక తోలును పరచుకోవాలి, ఆ తరువాత పరిశుద్ధం కావడానికి, సత్వగుణం అభివృద్ధి కావడానికి వాటిపై దర్భలను పరవాలి. ఇటువంటి ఆసనంపై కూర్చుంటే మనసుకు స్వచ్ఛత కలుగుతుంది. ఆసనానికి వెనుక భాగంలో నిలువుగా ఉండే ఒక పీట ఉండాలి.

లేకపోతే వీపు జారగిలబడి యోగానికి భంగం కలుగవచ్చు.

నిలుచుని ఉంటే, శ్రమపడితే నిద్ర వచ్చే అవకాశం ఉన్నది. అందువల్ల ఈ రెండు ఉండకూడదు. మనసును లగ్నం చేసి యోగాన్ని ఆచరించాలి. మనసుకు ఉండే విపరీత ప్రవృత్తులను ఇంద్రియాలను అణచుకోవాలి. శరీరంలోని మధ్య భాగాన్ని, తలను, కంఠాన్ని ఎటువంటి వంకర లేకుండా నేరుగా ఉంచుకోవాలి. కదలకూడదు. ఆసనం వెనక పీట ఉండడంవల్ల దానికి వెనుకభాగాన్ని అనుకోవాలి అనే ప్రయత్నం చేయకూడదు. అందువల్ల శరీరం కదిలే అవకాశం లేదు. ఈ విధంగా ఉంటేనే చాలాసేపు ధ్యానం చెయ్యడానికి వీలవుతుంది.

బయట ఉండే వస్తువులను వేనిని చూడకూడదు. నిద్ర రాకుండా ఉండేటట్లు తన ముక్కు చివరి భాగంపై దృష్టి నిలపాలి. మనసును ఆనందంగా ఉంచుకోవాలి. భయపడకూడదు. స్త్రీలను కోరికతో చూడడం గానీ, భావించడం గాని, మాటలాడడం గాని చేయకూడదు. భగవానుని మాత్రమే ధ్యానానికి విషయంగా కలిగి ఉండాలి. దీనివల్ల మనస్సు పరిశుద్ధమైన ఇక దేనిని భావించని స్థితికి అది చేరుకుంటుంది. ఇందువల్ల ఆత్మకు సంబంధించిన యోగం చక్కగా నడుస్తుంది.

యోగం చేసేవాడు ఎక్కువగా భుజించరాదు. భోజనం చేయకుండా కూడా ఉండరాదు. మితంగా భుజించాలి. అధికంగా నడవరాదు. నడవకుండా ఉండరాదు. ఎక్కువ నిద్ర పోవడం, నిద్ర లేకపోవడం, అధికంగా పనిచేయడం, ఏమి పని చేయకపోవడం - ఇవన్నీ తగవు. అన్నిటినీ చెప్పబడినంతవరకే చేస్తే యోగాచరణ సులభం అవుతుంది. లేకపోతే అడ్డు తగులుతుంది.

వాయువు లేని చోట దీపం పెడితే ఆ దీపం కదలకుండా ఉండి, కాంతి తగ్గకుండా ఉంటుంది. ఆ విధంగానే యోగాన్ని ఆచరించేవాని ఆత్మ స్వరూపం, మిగిలిన విషయాలు అన్నిటినుండి అతని మనస్సు నివర్తింపబడితే, జ్ఞాన రూపమై ప్రకాశిస్తుంది. అప్పుడు మనసుకు ఆనందం కలుగుతుంది. అంతులేని సుఖం కలుగుతుంది. ఈ అనుభవంలోనే యోగి చాలాకాలం ఉంటాడు.

యోగం పూర్తి అయిన తరువాత కూడా ఆ సుఖాన్ని, ఆనందాన్ని కోరతాడు. యోగంలో ఉండేటప్పుడు సద్గుణాలు కలిగిన పుత్రుని మరణం మొదలైన దుఃఖాలు కలిగినా, అతనిలో ఉత్సాహం, ఆసక్తి తగ్గవు. అవి యోగానికి అడ్డు రావు. ఇటువంటి యోగంలోని గొప్పదనం తెలిసికొని, ఇంతకుముందు తెలిపిన రీతిలో యోగాన్ని ఆచరించాలి.

(యోకిల్ శమనిలై నాల్వకైయుమ్) యోగాభ్యాసం చేసేవానికి అతని యోగం పరిణతిని పొందడానికి తగిన రీతిలో నాలుగు దశలు ఉన్నాయి. వాటిలో ముందు దశల కంటే తరువాతి దశలు పరిణతిని చెందినవి. ఆ నాలుగు దశలు ఏవి? అంటే,

1)జీవాత్మలు అన్నీ ప్రకృతి సంబంధం తీరిన పరిశుద్ధమైన స్థితిలో జ్ఞానైకరూపంగా ప్రకాశిస్తాయి. ఈ అనుసంధానాన్ని కల అధికారి తన ఆత్మను మిగిలిన ఆత్మల వంటిది అని, మిగిలిన ఆత్మలు తన ఆత్మవంటివి అని భావిస్తాడు. ఆత్మలన్నీ సహజంగా ఒకే స్వరూపాన్ని కలిగి ఉన్నందున, ఒక ఆత్మను చూస్తే మిగిలిన అన్ని ఆత్మలను అటువంటి స్వరూపాన్ని కలిగినవిగా దర్శింపబడినవి అవుతాయి. అందువల్ల, జ్ఞానస్వరూపమై ఉండడంచేత ఆత్మలు ఒకదానితో ఇంకొకటి సమానంగా ఉన్నాయని తెలిసి కోవడమే సమదర్శి మొదటి దశ .

2) పుణ్య పాపాలు తీరిన, పరిశుద్ధమైన జీవుడు భగవంతుని వంటివాడు అవుతాడు. అందువల్ల అన్ని ఆత్మలు, ఈశ్వరుడు సమమై ఉండడంచేత ,జీవాత్మ-పరమాత్మలు అనే రెండిటిలో ఒక దానిని చూచినవాడు ఇంకొక దానిని చూచి, ''దానివలె ఇది కూడా ఉన్నది'' అని భావిస్తాడు. అందువల్ల పరిశుద్ధమైన జీవాత్మలను పరమాత్మకు సమానంగా దర్శించడం రెండవ స్థితి. ఇది ముందు దశ కంటే ఎక్కువ పరిణతిని పొందిన దశ.

3) కర్మ సంబంధం లేకుండా సంకోచం లేని పరిపూర్ణమైన జ్ఞాన స్వరూపంగా ఉండే జీవాత్మ, పరమాత్మ వంటివాడు అవుతాడు. ఈ విధంగా యోగదశలో అనుసంధానం చేసేవాడు దీని సంస్కారాన్ని గాఢంగా పొంది

యోగానికి భంగం కలిగినప్పుడుకూడా తన అనుసంధానాన్ని అనువర్తింప చేసికొంటాడు. ఈ విధంగా తన ఆత్మను మిగిలిన ఆత్మలను యోగభంగం కలిగిన సమయంలో కూడా భగవంతునకు సమానంగా అనుసంధించడం మూడవ దశ. రెండవ దశ కంటే ఎక్కువ పరిణతిని పొందిన దశ.

**4)** ఆత్మలు అన్నీ ఏ లోటు లేని జ్ఞానస్వరూపాలై ఉండడంచేత సుఖదుఃఖాలను సమానంగా భావించాలి. అంటే, లోకంలో ఒకనికి పుత్రుడు కలిగితే వేరొకరికి ఆనందం, ఇంకొకరికి దుఃఖం కలగడం లేదు. ఈ విధమైన ఆనందం, దుఃఖం తనకు కలిగినప్పటికీ, యోగి ఆనందించడం కానీ, దుఃఖించడం కానీ చేయడు. ఈ విధంగా సుఖదుఃఖాలను సమానంగా భావించడమే నాలుగవ దశ. ఇదే జీవాత్మకు సంబంధించిన యోగ దశలలో ఉత్తమ దశ. ఈ విధంగా సమదర్శనం అనేది నాలుగు విధాలు.

(యోగినుపాయముమ్) జీవుని మనస్సు చాలాకాలం అల్ప విషయాలలోనే ఆసక్తిని కలిగి ఉండి, వాటిలో అలవాటు పడటం చేత దానిని అణచి, మనసును ఆత్మలో లగ్నం చేసి యోగాన్ని అభ్యసించడం చాలా కష్టమే. అయినప్పటికీ ఆత్మ సహజంగా అవినాశ్యమై ఉండడం, జ్ఞానానంద స్వరూపమై ఉండడం, కర్మకు వశం కాకుండా ఉండడం, దోషాలు దానికి తాకక పోవడం - అనే ఈ విషయాలను పరిశీలించి గమనించి ప్రవర్తిస్తే, మనసు ఆత్మలో లగ్నమై యోగం అనుకూలం అవుతుంది. ఆ విధంగానే, బాహ్యవస్తువులలో ఉండే దోషాలను భావన చేస్తే వైరాగ్యం కలిగి, ఆత్మకు సంబంధించిన యోగంలో మనసు ఆసక్తిని పొందుతుంది. ఇదే యోగం యొక్క ఉపాయం.

(యోగుతనాల్ వరుమ్ పేఱుకళుమ్) శ్రద్ధతో యోగాన్ని చేయడం ఆరంభించినవాడు తరువాత అందులో దృఢమైన సంస్కారాన్ని పొందలేక పోవడం వల్ల, ప్రారంభించిన సమయంలోనే యోగం నుండి భ్రష్టుడు అయినా, అతనికి ఏ విధమైన హాని కలుగదు. ఏ విధమైన భోగాన్ని అనుభవించాలని అతడు ఆశపడి యోగాన్ని చేసి తరువాత ఆ యోగంనుండి భ్రష్టుడయ్యాడో, ఆ విధమైన భోగాలను పుణ్యశాలులు అనుభవించే పుణ్యలోకాలలో చాలాకాలం



ఆ ఆశ తీరేవరకు యోగ మహిమ చేత అనుభవించి, తరువాత మహాత్ముల కులంలో జన్మించి, వారి సంబంధంతో యోగాభ్యాసాన్ని మళ్ళీ తిరిగి ఆరంభిస్తాడు.

యోగం పరిణతి చెందిన దశలో సిద్ధిని పొందడానికి ముందు ఆ యోగంనుండి భ్రష్టుడు అయితే, యోగాభ్యాసం చేసేవారు ఆ యోగాన్ని ఉపదేశించే శక్తిని కలవారు అయిన మహాత్ములకు పుత్రుడు గాను, వేరే విధంగా, అటువంటివారికి బంధువుగానో జన్మిస్తాడు. అందుచేత పూర్వదేహంలో ఉండే

విధంగా యోగానికి సంబంధించిన జ్ఞానాన్ని కలవాడై, నిద్రపోయి లేచిన వాని వలె మళ్ళీ తిరిగి సిద్ధిని పొందడానికి ప్రయత్నిస్తాడు. తరువాత ఏ అడ్డు లేకుండా యోగ సిద్ధిని పొందుతాడు. ఇవి అన్ని యోగమహిమవల్లనే కలుగుతాయి.

యోగాన్ని ఆరంభించకుండా ఆరంభించాలని అనుకున్నప్పుడే ఆ ప్రయత్నంనుండి జారిపోతే, యోగమహిమ వల్ల మళ్ళీ తిరిగి ఆ ఆశ కలిగి, తరువాత కర్మయోగం, జ్ఞానయోగం అనే వీటిని ఆచరించి, జ్ఞానానంద స్వరూపుడైన ఆత్మను సాక్షాత్కరింప చేసి కొంటాడు.

ఈ విధంగా యోగంతో సంబంధాన్ని కల ప్రతి ఒక్కడు ఏదశలో భ్రంశాన్ని పొందినా, చివరిలో సిద్ధిని పొంది తీరుతాడు.

(యోగుతనిల్ ....ముక్కియముమ్) భక్తియోగాన్ని చేసేవాడు అంతులేని భక్తితో భగవానుని క్షణ కాలం అయినా విశ్లేషిస్తే ప్రాణాన్ని నిలుపుకోలేని దశను పొందినవాడై, ఆ భగవానుని త్వరగా చేరి అనుభవించాలి అనే ఆశతో చాలా తొందర కలవాడై, భగవంతుని సాక్షాత్తుగా ఉపాసించేవాడు కాబట్టి, అతడే పూర్వం తెలిపిన యోగులు అందరికంటే గొప్పవాడు. అతడు ఆచరించి యోగం ముందు తెలిపిన యోగాలకంటే గొప్పది.

సర్వేశ్వరుని ఆశ్రయించిన (అంటే, విషయంగా కల) యోగం గొప్పది అయినా, వసుదేవుని పుత్రుడై అవతరించిన శ్రీకృష్ణుని దివ్య మంగళ రూపాన్ని విషయంగా కలిగి ఆచరించే భక్తి యోగం చాలా గొప్పది-అని ఇక్కడ సూచింపబడినట్లు అయినది.

ఈ విషయాలను అన్నిటినీ శ్రీకృష్ణుడు అర్జునునకు ఆరవ అధ్యాయంలో ఉపదేశించాడు.

## సప్తమాధ్యాయసారవివణం

8. తానిన్ఱ ఉణ్మైయై త్తన్ తనిమాయై మఱైత్తమైయుమ్
తానన్ఱి మాయైతనై త్తవిర్ప్పాన్ విరకన్ఱిమైయుమ్
మేనిన్ఱ పత్తర్కళ్ నాల్వరిల్ ఞానితన్ మేన్మైకళుమ్
తేనిన్ఱ శెజ్గழలాన్ తెళివిత్తనన్ పార్త్తనుక్కే ●

తేనెను కల (తామరపూలవంటి) శ్రీచరణాలను కల్గిన శ్రీకృష్ణుడు అర్జునునకు - ఈశ్వరుడైన తాను మిగిలిన అన్యవస్తువులకంటే విలక్షణుడై ఉండే తన స్వభావం, తనకు శేషమైన సాటి లేని ప్రకృతి జీవుని ఆవరించడం, ప్రకృతి సంబంధాన్ని తీర్చుకోవడానికి తాను తప్ప వేఱు ఏ ఉపాయం జీవునకు లేకపోవడం, ముందువారి కంటే తరువాతివారు గొప్పవారనేటట్లుండే భక్తులు నల్గురిలో (ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞాని - అనే నల్గురిలో) జ్ఞానికి గల అతిశయం- అనేవీనిని గూర్చి స్పష్టంగా పలికాడు.

**వ్యాఖ్యానం:** (తానిన్ఱ ....మఱైత్తమైయుమ్) భగవంతుడు చేతనాచేతనాల కంటే విలక్షణుడు. వాటిని తనకు విశేషంగా కలవాడు. వాటికి కారణమై ఉండేవాడు. అవి ఆ స్వామిలోనే లయాన్ని పొందుతాయి. అతనికి శరీరమై ఉంటాయి. భగవంతుడు జ్ఞానం మొదలైన సమస్త కళ్యాణ గుణాలకు ఆకరం. అన్ని విధాలా అతడే గొప్పవాడు. అతనికంటే గొప్పవారు కానీ, సమానులు కాని ఎవరూ లేరు. ఇటువంటి ఆ స్వామి వైభవాన్ని తెలిసికోవడానికి వీలు కాని రీతిలో భగవంతునిచే సృష్టింపబడిన, అతనికి శేషం అయిన మాయ అడ్డుపడుతున్నది. దీనికి ప్రకృతి అని పేరు. ఇది సత్వం, రజస్సు, తమస్సు అనే మూడు దోషాలను కలిగినది. శరీరాలు, ఇంద్రియాలు మొదలైనవాని రూపంలో పరిణామాన్ని ఇది పొందుతున్నది.

(తానన్ఱి....విరకన్ఱిమైయుమ్) ఈ విధంగా భగవంతుని గొప్పతనాన్ని మరుగుపరిచే మాయను దాటి, అతనిని ఉపాసించడానికి తగిన ఉపాయం ఆ

స్వామి పాదాలను శరణు పొందడమే. ఈ మాయను పోగొట్టుకోవడానికి భగవంతుని పాదాలను ఆశ్రయించడం తప్ప ఇంకొక ఉపాయం ఏది లేదు.

(మేనిష్ట....మేన్మైకళుమ్) భగవంతుని శరణాగతి చేసి ఆరాధించే అదృష్టవంతులు నలుగురు ఉన్నారు. వారికి ఆర్తులు, ఆర్థార్థులు, జిజ్ఞాసువులు, జ్ఞానులు అని పేరు.

1) ఆర్తులు అంటే ఐశ్వర్యాన్ని పోగొట్టుకొని తరువాత దానిని పొందాలని ఆశపడే వారు.

2) అర్థార్థులు అంటే ఇంతకు ముందు లేని ఐశ్వర్యాన్ని పొందాలని కోరేవారు.

3) జిజ్ఞాసువులు అంటే ప్రకృతి సంబంధం తీరిన పరిశుద్ధమైన ఆత్మ స్వరూపాన్ని పొందాలని కోరేవారు.

4) జ్ఞానులు అంటే భగవంతునకు శేషమైన ఉండడమే స్వభావంగా కల తన ఆత్మస్వరూపాన్ని తెలిసికొని, ప్రకృతి సంబంధం తీరిన ఆత్మ స్వరూపాన్ని అనుభవించడంతో ఆగకుండా భగవంతుని అనుభవాన్ని చాలా గొప్ప ఫలంగా గ్రహించేవారు.

ఈ విధంగా నాలుగు విధాలుగా ఉండేవారు అందరూ వేరు ఏ దేవతను ఆరాధించకుండా భగవంతుడినే ఆరాధిస్తారు. ఈ లోకంలో సాధారణంగా చాలామంది పూర్వజన్మ వాసన వల్ల వివేకం లేకుండా అల్పమైన ప్రయోజనాలను కోరి, ఇంద్రాది దేవతలను పూజిస్తారు. ఆ విధంగా కాకుండా, ఆ ప్రయోజనాల కోసం భగవంతుడినే ఉపాసించే ఈ నాలుగు విధాలైనవారు లోకంలో కనిపించడం చాలా తక్కువ. ఈ నలుగురిలో చివరివాడైన జ్ఞానికి కల వైభవం చెప్పడానికి సాధ్యం కాదు. మొదటి ముగ్గురు తాము కోరిన ప్రయోజనాలను పొందే వరకే భగవంతుని విషయంలో ప్రీతిని కలిగి ఉంటారు. తాము కోరిన ప్రయోజనం పొందాలని కోరుతున్నందున దానికి సాధనంగా ఉండే భగవంతుని వద్ద కూడా వారికి భక్తిని కలిగి ఉండవలసి వచ్చింది.



ఇక జ్ఞాని అయితే భగవంతుని తప్ప ఇంకొక ఫలాన్ని దేనిని కలలో కూడా భావించడు. కనుక, ఎల్లప్పుడూ ఆ స్వామి విషయంలోనే అభినివేశం కలిగి ఉంటాడు. ఆ స్వామి విషయంలో భక్తిని కలిగి ఉంటాడు. అంతేకాదు, భగవంతుని విషయంలో జ్ఞానికి ఉండే ప్రేమ ఇంతటిదని చెప్పడానికి, తెలియడానికి సర్వజ్ఞుడైన, సర్వశక్తి అయిన భగవంతునకు కూడా సాధ్యం కాదు. భగవంతుని విడచి అతడు ఒక్క క్షణం కూడా ప్రాణాలను ధరించలేడు. అతడు ఇటువంటి స్థితిలో ఉన్నందున భగవంతుడు కూడా "అతని వీడి ఒక్క క్షణం కూడా ఉండలేను'' అనే విధంగా అతనిని తనకు ప్రాణంగా భావిస్తాడు. భగవంతునకు శేషమై ఉండడమే ఆత్మ స్వరూపం అని తెలిసి కొని, భగవంతుని శరణం పొందగలగడం అనేది పూర్వం ఎన్నో జన్మల పుణ్యాన్ని కలిగి ఉంటేనే వీలుపడుతుంది. ఇటువంటి భాగ్యాన్ని పొందిన జ్ఞానిని లోకంలో చూడడం, తెలుసుకోవడం చాలా అరుదు. ఎందుకంటే, అటువంటివారు చాలా తక్కువ సంఖ్యలో కనిపిస్తారు. ఈ అర్థాలను శ్రీకృష్ణుడు ఏడవ అధ్యాయంలో అర్జునునకు ఉపదేశించాడు.

## అష్టమాధ్యాయసారవివరణం

9. ఆరాద శెల్వముమ్ ఆరుయిర్ కాణు మరుమ్ పయనుమ్
పేరాద తన్ కழలిక్కழమరుమ్ పెరువాழ்చ్చికళుమ్
శోరాతుకన్దవర్ తూమది కొళ్వదుమ్ శెయ్వనవుమ్
తేరా విశయనుక్కు త్తిరునారణన్ శెప్పిననే ●

శ్రీమన్నారాయణుడైన శ్రీకృష్ణుడు జ్ఞానంలో స్పష్టత లేని అర్జునునకు - "చాలు" అని అనిపించని ఐశ్వర్యాన్ని గూర్చి, అరుదైన జీవస్వరూపాన్ని గూర్చి దర్శించి ఆనందించడమనే (కైవల్యమనే) దుర్లభమైన ప్రయోజనాన్ని గూర్చి, సర్వేశ్వరుడైన తన శ్రీచరణాల చెంత విశ్లేషించకుండా ఉండడమనే గొప్ప ఉజ్జీవనాన్ని (మోక్షపురుషార్థాన్ని) గూర్చి, ఏ కొఱత లేకుండా పొందాలని కోరే అధికారులు పరిశుద్ధమైన తమ మనస్సుతో తెలియవలసినవానిని గూర్చి, అనుష్ఠించవలసినవానిని గూర్చి ఉపదేశించాడు.

**వ్యాఖ్యానం:** (ఆరాద శెల్వముమ్) బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు అనే వీరి భోగాల కంటే మిక్కిలి గొప్పది అయిన ఐశ్వర్యాన్ని కోరేవారు ఐశ్వర్యార్థులు అనబడతారు. పోగొట్టుకున్న సంపదను పొందగోరిన అర్థార్థులు కూడా ఇక్కడ ఐశ్వర్యార్థులు అని చెప్పబడింది.

(ఆరుయిర్ కాణుమ్ ఐరుమ్ పయనుమ్) ప్రకృతి సంబంధం తీరగా పరిశుద్ధమైన దర్శించి అనుభవించే ఆత్మానుభవం కైవల్యం అనబడుతుంది. దీనిని కోరేవారు కైవల్యార్థులు.

(పేరాదు....వాழ்చ్చికళుమ్) భగవంతుని పాదాలను నిలువకుండావాటి సమీపంలో ఉండి, సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలలో సర్వవిధ కైంకర్యాలను చేయడమే మోక్షం అనబడుతుంది. దీనిని కోరేవారు మోక్షార్థులు ఆనబడతారు.

(శోరాదు....శెయ్ వనవుమ్) ఈ విధంగా మూడు విధాలుగా ఉండే అధికారులు తెలియవలసిన విషయాలు, స్వీకరించవలసిన విషయాలు ఈ అధ్యాయంలో ఉపదేశింపబడినాయి.

ఐశ్వర్యార్థి తెలియ దగిన విషయాలు:

1) ఆకాశం మొదలైన భూతాలు, వాటినుండి నశించిపోయే స్వభావాన్ని కల శబ్దస్పర్శాదులు. ఇవి అధిభూతాలు అనబడతాయి.

2) ఇంద్రుడు, బ్రహ్మ, రుద్రుడు మొదలైన సకల దేవతల స్థానాలకు పైన ఉండి వారు అనుభవించే భోగాల కంటే గొప్ప అనుభవాన్ని అనుభవించే దశ. ఇది అధిదైవతం అనబడుతుంది.



కైవల్యార్థులు గ్రహించ దగినవి:

1) ప్రకృతి సంబంధం తీరిన పరిశుద్ధమైన ఆత్మ స్వరూపం తద్బ్రహ్మం అనబడుతుంది. ఇది అనుభవించదగినదిగా పొందదగినదిగా తెలియాలి.

2) అచేతనమైన ప్రకృతి. ఇది అధ్యాత్మ అనబడుతుంది.

3) స్త్రీల సంగమాలవల్ల ఏర్పడి, మానవుడు మొదలైన జన్మలను కలిగించేది విసర్గం. దీనికి కర్మ అని పేరు. దీనికి కారణం అయిన కర్మ, దీని వల్ల ఏర్పడే గర్భవాసం అనే వీటిని విడువ తగినవని తెలియాలి.

మోక్షార్థులు తెలియదగినవి:

ప్రతీ కర్మను అనుష్ఠించేటప్పుడు ఇంద్రాది దేవతలు భగవంతునకు శరీరంగా ఉండేవారని, వారికి అంతర్యామిగా ఉండే భగవంతుడే ఆయా కర్మలచే ఆరాధింపబడుతున్నాడని తెలియాలి. ఈ అనుసంధానం ఐశ్వర్యార్థి, కైవల్యార్థులకు కూడా సమానమే.

ఇక ఈ ముగ్గురు స్వీకరించవలసిన అంశాలు:

ఐశ్వర్యార్థి - తన నిత్య నైమిత్తిక కర్మలకు అడ్డు లేని అన్ని సమయాలలోనూ భగవంతుని ధ్యానం చేయాలి. ప్రతిదినం యోగానికి నిర్దేశింపబడిన సమయంలో భక్తి యోగాన్ని ఆచరించాలి. దీనివల్ల అతని మనసు అక్కరలేని విషయాలలో ప్రసరించకుండా ఉంటుంది. తరువాత అంతిమ సమయంలో అతడు భగవంతుని ధ్యానించాలి. భగవంతుని అతడు ఎటువంటి వానినిగా మరణ సమయంలో భావిస్తాడో, అటువంటి పరమపురుషుని ఐశ్వర్యానికి సమమైన ఐశ్వర్యాన్ని ఆ ఉపాసకుడు పొందుతాడు.

కైవల్యార్థి - కన్ను, ముక్కు మొదలైన జ్ఞానేంద్రియాలను అల్ప విషయాలలో లగ్నం కాకుండా ఉండేటట్లు నియంత్రించి, హృదయకమలం ఉండే భగవానుని విషయంలో కేంద్రీకరించి, నిలకడగా అతని విషయంలో ప్రీతిని పొందాలి. ప్రణవాన్ని అనుసంధిస్తూ శిరోభాగంలో ప్రాణాలను నిలిపి మరణించాలి. ఈ విధంగా మరణించేవాడు ప్రకృతి సంబంధం తీరి

భగవంతుని వంటి ఆత్మను అనుభవిస్తాడు.

మోక్షార్థి - ఎల్లప్పుడు భగవంతుని తప్ప ఇక ఏ విషయంలోనూ మనసును లగ్నం చేయడు. భగవంతుని క్షణకాలం విడచినా ప్రాణాలను నిలుపుకోలేడు. అతనిని విడిచి ఉండడానికి భగవంతునకు కూడా సాధ్యం కాదు. ఇటువంటి అధికారికి భక్తి యోగానికి కల ఆటంకాలను తీర్చి, దానివి పూర్తి చేసి, పరమపదానికి చేర్చి, అతని నుండి తాను కైంకర్యాన్ని గ్రహించేవరకు గల క్రమాన్ని అంతటిని భగవంతుడు తన బాధ్యతగా తలచి నిర్వహిస్తాడు.

మరణించేటప్పుడు భగవంతుని ధ్యానించడానికి అంతిమస్మృతి అని పేరు. అర్చిరాదిగతిని స్మరించడం ఐశ్వర్య, కైవల్యార్థులకు సమానం.

ఈ విషయాలను అన్నిటినీ శ్రీకృష్ణుడు అర్జునునకు ఎనిమిదవ అధ్యాయంలో ఉపదేశించాడు.

## నవమాధ్యాయసారవివరణం

**10. తన్ మేన్మైయుమ్ తన్ పిఱప్పిల్ తళరాత్తనినిలైయుమ్**
**పన్మేని నణ్ణినన్ పాల్ పిరియా అన్బరాశైకళుమ్**
**పున్మేని విణ్ణవర్పాల్ పురియాత త్తన్పత్తియైయుమ్**
**నన్మేని నారణన్తాన్ నరనుక్కు నవిష్టననే ●**

గొప్ప తిరుమేనిని కల శ్రీమన్నారాయణుడు (శ్రీకృష్ణుడు) అర్జునునకు - ఈశ్వరుడైన తన గొప్పదైన స్వభావాన్నిగూర్చి, తన అవతారాలలోని పరత్వాన్ని గూర్చి, దేవతలు, మనుష్యులు మొదలైన పలు విధాలైన శరీరాలలో అంతర్యామిగా ఉండే తన పట్ల ఏనాడూ విశ్లేషించని ప్రేమను కల మహాత్ములు తనకు ఆశతో చేసే కైంకర్యాలను గూర్చి, అల్పమై నశించిపోయే శరీరాన్ని కల దేవతల విషయంలో అన్వయించని భక్తియోగాన్ని గూర్చి ఉపదేశించాడు.

**వ్యాఖ్యానం:** (తన్ మేన్మైయుమ్) భగవంతుడు ఈ చేతనాచేతనాలలో తన స్వరూపాన్ని మరుగు పరచుకొని అంతర్యామియై వాటిలో వ్యాపించి ఉన్నాడు. వాటి స్వరూపం, రక్షణ భగవంతుని స్వరూపం వల్ల సిద్ధిస్తున్నవి. తన సంకల్పంతో సకల వస్తువులను సృష్టించి, రక్షించి, వాటిని ఆయా కార్యాలలో అతడు




వినియోగిస్తాడు. అవి పొందే ఫలాలను తనవిగా స్వీకరిస్తున్నాడు. సకల వస్తువులను తనకు శరీరంగా కలిగి ఉన్నాడు. అన్నిటినీ ప్రళయకాలంలో తన సంకల్పంతో లయం చేసి తరువాత మళ్లీ సృష్టిస్తున్నాడు. జీవులు వారు వారు చేసిన కర్మలకు తగినట్లు ఫలాన్ని ఇచ్చే వాడు భగవంతుడే. కనుక అతనికి నైర్ఘృణ్యం, వైషమ్యం మొదలైన దోషాలు లేవు. జీవుల కర్మానుసారం అతడు

చేసే సంకల్పం వల్లనే లోకం అంతా నడుస్తున్నది. అన్నీ భగవంతుని మహిమలే.

(తన్ పిఱప్పిల్ తళరా తని నిలైయుమ్) భగవంతుడు ఈ కర్మభూమిలో పుట్టినవారందరూ తనను ఆశ్రయించడానికి తగినట్లు మనుష్యుడై అవతరించినప్పటికీ తన గుణాలలో, మహిమలో ఏ కొంచెం లోపం లేకుండా ప్రకాశిస్తున్నాడు. అవతారాలలో అతని సౌలభ్యాన్ని చూచి అతనిని మనం తక్కువగా భావించకూడదు.

(పన్మేని...అశైకళుమ్) భగవంతునిపై అంతు లేని భక్తిని కల భాగవతులు తమకు గల భక్తితో ఆ స్వామికి పలు విధాలైన సేవలను చేస్తారు. అవి ఏవి? అంటే, భగవంతుని నామాలను అనుసంధించడం, ఆ సమయంలో తమ దేహంలో గగుర్పాటును పొందడం, కంఠం గద్గదం కావడం, శ్రీమన్నారాయణాది విశేష నామాలను అనుసంధించడం, అర్చించడం, ఆలయాలు, నందనవనాలు మొదలైన వానిని నిర్మించడం, భూమిపై రాళ్లు, ముళ్ళు ఉన్నాయని లెక్కపెట్టకుండా సాష్టాంగ దండ ప్రణామాలు చేయడం, ఎల్లప్పుడూ భగవంతుని అనుభవాన్ని కోరడం మొదలైనవి.

స్వర్గం మొదలైన అల్పమైన ఫలాలను కోరేవారు సమర్పించే వస్తువులు భగవంతుని పాదాలను చేరుతాయి. వేరు దేనినీ ఆశించకుండా ఉండే పరమై కాంతి ఒక దళాన్ని గాని, పుష్పాన్ని గాని, ఫలాన్ని గాని శుభ్రమైన జలాన్ని గాని సమర్పిస్తే భగవంతుడు దానిని తన శిరస్సుతో గ్రహించి, అతని మనసులోని పరిశుద్ధిని గమనించి, తాను అలభ్యలాభాన్ని పొందినట్లు సంతోషించి, స్వీకరిస్తాడు.

(పున్మేని...పత్తిమైయుమ్) భక్తుడు తన శరీరాన్ని పోషించుకోవడానికి అవసరమైన కర్మలను, వర్ణాశ్రమ ధర్మాలను భగవంతుని కోసం చేస్తూ, అవి అతనిచే చేయిబడుతున్నాయి-అని భావిస్తాడు. పూర్వం తెలిపిన రీతిలో అర్చనం, కీర్తనం మొదలైన సేవలను సంతోషంతో చేస్తాడు. ఇంతేకాక, లోకం అంతా భగవంతునకు శేషం అని భావిస్తాడు. ఆ స్వామికి కల కళ్యాణ గుణాలను మనసులో సదా భావిస్తాడు. వేరు ఏ దైవాన్ని మనసుతో కూడా భావించడు.

ఇటువంటి భక్తి యోగాన్ని దేహం ఉన్నంతవరకు ఆచరించి చివరిలో ఫలాన్ని పొందుతాడు.

ఈ విషయాలను శ్రీకృష్ణుడు తొమ్మిదవ అధ్యాయంలో అర్జునునకు ఉపదేశించాడు.

## దశమాధ్యాయసారవివరణం

11. ఎల్లై యిల్లాద తన్‌శీలము మిన్నముతక్కడలుమ్
ఎల్లై యిల్లాద విభూతి యెల్లామ్ తనతానమైయుమ్
ఎల్లైయిల్ పత్తితనై ఎழுవిక్క త్తిరువరుళాల్
ఎల్లైయిలీశనియమ్బినన్ ఇన్దిరన్‌మైన్దనుక్కే ●

అంతులేని స్వరూపస్వభావాలను కలవాడైన సర్వేశ్వరుడు ఇంద్ర పుత్రుడైన అర్జునునకు - అంతు లేని భక్తిని కల్గించి, దానిని వృద్ధి చేసే అంతు లేని తన శీలమనే కల్యాణగుణామృత సముద్రాన్ని గూర్చి, అవధి లేని ప్రపంచం అంతా తన నియమనానికి లోబడి ఉండడాన్ని గూర్చి గొప్ప కృపతో ఉపదేశించాడు.

**వ్యాఖ్యానం:** (ఎల్లై యిల్లాద....కడలుమ్) దేవతలు, మహర్షులు ఇంద్రియాలకు కనిపించని విషయాలను కూడా గ్రహిస్తారు. మిగిలినవారి జ్ఞానం కంటే వారి జ్ఞానం గొప్పది. ఇటువంటి వారి స్వరూపం, జ్ఞానం, శక్తి కూడా భగవంతుని అనుగ్రహం వల్ల పొందినవే. ఆ జ్ఞానం అంతా వారి వారి పుణ్యాలకు తగినట్టు అనుగ్రహింపబడినది కనుక పరిచ్ఛిన్నం అవుతుంది. అందువల్ల వారు భగవంతుని నామం, లీలలు, స్వరూపం, స్వభావం మొదలైనవానిని యథాతథంగా తెలియలేరు. లోకంలో ప్రభువు అందరి మానవులవంటివాడే అయినా తన కర్మవశం చేత అటువంటి పదవిని పొందుతున్నాడు. ఆ విధంగానే బ్రహ్మ, ఇంద్రుడు మొదలైనవారు కూడా మిగిలిన సంసారులవంటి వారే

అయినా తమ పుణ్యవశం చేత ఆయా పదవులను పొందారు. భగవంతుడైతే చేతనాచేతనాలలో అంతర్యామిగా ప్రవేశించి వారికి ప్రాణమై ఉండేవాడై, వారిని రక్షించేవాడై ఏ దోషం లేని వాడై, అన్ని కళ్యాణ గుణాలకు ఆకరమై ఉన్నాడు. అందువల్ల చేతనాచేతనాల కంటే విలక్షణుడై ఉన్నాడు. పరమాత్మకు కల ఇటువంటి స్వరూపాన్ని, స్వభావాన్ని తెలిసినవాడు తనకు భక్తి కలగడానికి అడ్డంగా ఉండే పాపాలు అన్ని తీరినవాడై భక్తి కలిగినవాడు అవుతాడు.



(ఎల్లై యిల్లా....ఆనమైయుమ్) సకలజీవులకు వారు ఏదైనా ఒక పనిని చేయడం కానీ, చేసే పని నుండి విరమించడం కానీ - ఈ విధంగా ఉండే మానసికమైన వారి దశలు అన్నీ భగవంతుని సంకల్పం వల్లనే కలుగుతున్నాయి. గడచిన మన్వంతరాలకాలంలో లోకాలను సృష్టించడం కోసం బ్రహ్మ మనస్సు నుండి పుట్టిన భృగువు మొదలైన ఏడు మంది ఋషులు, రక్షించడానికి పుట్టిన సావర్ణులు నలుగురు, మనువులు అందరు అతని సంకల్పానుసారం నడచు కోవలసినవారే. అన్ని దశలలో ఉండే అన్ని వస్తువులకు ఆయా దశలను ఇవ్వగలిగినవాడు, మనకు కనిపించి కానీ, కనిపించకుండా కానీ ఉండగలిగిన

వాడు భగవానుడే. అతనిని అంతర్యామిగా లేని వస్తువు అనేది ఈ లోకంలో లేనే లేదు. చేతనాచేతనరూపమైన ఈ లోకం అంతా కార్య దశలో కానీ, కారణం దశలో కానీ, సూక్ష్మ దశలో కానీ, స్థూల దశలో కానీ, ఉత్పత్తిలో కానీ, రక్షణలో కానీ, లయంలో కానీ భగవంతుని సంకల్పం దాటి ఏ కొంచెం కూడా నడుచుకునే శక్తి కలిగినది కాదు. భగవంతుడు తనకు కల నియమించి పాలించే శక్తిలోని చాలా అల్పమైన అంశతో ఆయా వస్తువులలో వ్యాపించి ఉన్నాడు.

(ఎల్లైయిల్...ఎప్పువిక్క) అందువల్ల భగవంతుడు సకల కళ్యాణ గుణాలతో ప్రకాశిస్తున్నాడని, అతడే ప్రపంచానికి కారణమై, అన్నిటినీ నడుపుతున్నాడని తెలిసినవారు ఆ స్వామిపైన మనసును లగ్నం చేస్తారు. భగవంతుని అనుభవం లేకుండా ఒక్క క్షణం కూడా ప్రాణాలను నిలుపుకో లేరు. తమచే అనుభవింపబడిన భగవంతుని కళ్యాణ గుణాలను ఒకరికి ఇంకొకరు తెలుపుకుంటూ ఆనందిస్తారు. అతి మానుషాలు, అద్భుతములు, మధురాలైన భగవంతుని చరిత్రలను ఇతరులకు తెలుపుతూ, ఇతరుల నుండి తాము వింటూ ఆనందిస్తారు. ఈ విధంగా ఉంటే భక్తి ఇంకా ఇంకా వృద్ధి అవుతుంది.

ఈ విషయాలను శ్రీకృష్ణుడు అర్జునునకు పదవ అధ్యాయంలో ఉపదేశించాడు.

## ఏకాదశాధ్యాయసారవివరణం

12\. ఎల్లామ్ తనక్కురువాయ్ ఇలఙ్గుమ్‌వకై తానురైత్తు
చ్చొల్లాలతిన్దదు శోఙామల్ కణ్డిడవేణ్డు మెన్ఱ
విల్లాళనుక్కన్ఱు మెయ్‌క్కణ్ కొడుత్తిదువేఱు ముణ్డో
నల్లార్‌కళ్ కాణ్‌బరెన్ఱు న్నవిన్ఱాన్ నఙ్గళ్ నాయకనే ●

మన నాయకుడైన కృష్ణుడు - సకలవస్తువులు భగవానుడైన తనకు శరీరమై ప్రకాశించే రీతిని గూర్చి అర్జునునకు ఉపదేశించాడు. తన సూక్తులద్వారా తెలిసిన తన ఐశ్వర్యాన్ని అంతటిని ప్రత్యక్షంగా దర్శించాలనే ఆశను అతడు పొందగా, గొప్ప విలుకాడైన ఆ అర్జునునకు అపుడే తన స్వరూపాన్ని యథాతథంగా దర్శించగల్గిన దివ్యచక్షువును అతనికి ఇచ్చాడు. "నన్ను ఈ విధంగా దర్శించడానికి తగిన సాధనం భక్తి తప్ప వేఱు ఏదయినా ఉన్నదా? ఏమీ లేదు. భక్తిని కలవారైన సత్పురుషులు నా రూపాన్ని దర్శిస్తారు" - అని అతనికి ఉపదేశించాడు.

**వ్యాఖ్యానం:** (ఎల్లామ్ తనక్కు....ఉరైత్తు) పూర్వం పది అధ్యాయాలు వరకు ఉపదేశించిన శ్రీకృష్ణుని చూచి అర్జునుడు అతనితో ఈ విధంగా ప్రార్థించాడు. "పుండరీకాక్షా! శరీరాన్ని ఆత్మగా భావించి మోహాన్ని పొంది, భ్రాంతిని పొందిన నాపై దయ చూపి ఆత్మకు సంబంధించిన సత్యాన్ని ఉపదేశించి నా మనసులోని కలతను పోగొట్టావు. నీకంటే మిగిలిన వస్తువులన్నీ పరమాత్మవు అయిన నీ వల్ల జన్మను, నాశాన్ని పొందుతున్నాయి అని తెలిసికొన్నాను. చేతనా చేతనాలైన సకలవస్తువుల కంటే నీవే అధికుడవని, అన్ని వస్తువులను నీకు శరీరంగా కలవాడవని, వాటికి ఆధారమై ఉన్నవాడవని, లోకంలో భావించడం, చూడడం మొదలైన అన్ని కార్యాలు నీ సంకల్పం చేతనే జరుగుతున్నాయని తెలిసికోవడంతో పాటు ఇంకా నీకు చెందిన పలువిధాలైన గొప్పతనాలను విని తెలిసికొన్నాను. అవి అన్ని నిజమే అనే నమ్మకాన్ని పొందాను.

(శొల్లా...విల్లాళనుక్కు) ఈ విధంగా నీ గొప్పతనాన్ని నీవు ఈ నోటితోనే పలుకగా వినే భాగ్యాన్ని పొందిన నేను అట్టి అదృష్టానికి తగినట్లు నీ దివ్య రూపాన్ని సేవించాలని కోరుతున్నాను. నీ విశ్వరూపాన్ని నేను సేవించగలను అని నీవు భావిస్తే, సమస్తగుణవిభూతిస్వరూపములుతో కూడిన నీ రూపాన్ని నాకు దర్శింప చేయాలి.

(అన్లు మెయ్...క్కణ్ కొడుత్తు) ఈ విధంగా ఉత్సాహంతో, ఆనందం వల్ల కలిగిన గద్గదస్వరంతో ప్రార్థించిన అర్జునుని చూచి శ్రీ కృష్ణుడు ఈ క్రింది విధంగా అన్నాడు. "అర్జునా! వందలకొలది వేలకొలది ఉన్నవి, పలు విధాలుగా ఉన్నవి, దివ్యాలై, పలు వర్ణాలను కలిగిన నా రూపాలను చూడు. ఈ లోకంలో నీవు, ఇతరులు సాక్షాత్తు దర్శించినవి, శాస్త్రాల ద్వారా తెలిసికొన్నవి అయిన సకల వస్తువులను సకలలోకాలలో సకల శాస్త్రాలలో తెలిసికోబడని ఆశ్చర్యాలను నా రూపంలో చూడు. ఇంకా, పాండవులు, కౌరవులు యుద్ధం చేయడం, జయించడం మొదలైనవానిని కూడా నా రూపంలోని ఏక దేశంలోనే చూడు. నీ కన్నులు భౌతికాలు కనుక ఏవో కొన్ని వస్తువులను మాత్రమే చూడగలవు. ఈ కంటితో నా విశ్వరూపాన్ని దర్శించ లేవు. అందువల్ల నీకు నేను దివ్య నేత్రాన్ని ఇస్తున్నాను. దానితో నీవు నా రూపాన్ని చూడవచ్చు". ఈ విధంగా శ్రీకృష్ణుడు పల్కి అర్జునునకు దివ్య నేత్రాన్ని ఇచ్చి, తన విశ్వరూపాన్ని దర్శింపజేశాడు.

ఆ రూపం గొప్ప తేజస్సుతో ప్రకాశిస్తున్నది. పలు విధాలుగా ఉండే పలు ముఖాలను, నేత్రాలను కలిగినది, ఆశ్చర్యకరమైనది, దివ్యమైన ఎన్నో ఆభరణాలను, గొప్ప మాలికలను, వస్త్రాలను అలంకరించుకొన్నది, పలు విధాలైన దివ్యాయుధాలను చేతిలో ధరించి ఉన్నది, అన్ని దిక్కులలో ముఖాలను కలిగి ఉన్నది గొప్ప గంధాన్ని పూసి కొన్నది, ఆశ్చర్యాన్ని కలిగించే పలు వస్తువులకు ఆధారమై ఉన్నది, ఒకే సమయంలో ఉదయించిన వేలాది సూర్యుల తేజస్సు వంటి తేజస్సును కల ఆ విశ్వరూపంలోని ఏక దేశంలో అన్ని లోకాలు ఒదిగి ఉండడాన్ని అర్జునుడు చూసి ఆశ్చర్యపడ్డాడు. అతని శరీరం గగుర్పాటును పొందింది. అతడు దండ ప్రణామాలు చేసి, చేతులను జోడించి పలు విధాలుగా భగవంతుని స్తుతించాడు, "స్వామీ! నీ మహిమను



నేను తెలియలేక నిన్ను నా స్నేహితుడవని భావించాను. నేను ఎన్నో తప్పులను నీ విషయంలో చేశాను. నన్ను క్షమించు" అని ప్రార్థించాడు. భయంకరమైన ఆ విశ్వరూపాన్ని ఉపసంహరించుకుని చల్లని పూర్వరూపంలోనే మళ్లీ సాక్షాత్కరించమని ప్రార్థించాడు. శ్రీకృష్ణుడు కూడా అతని ప్రార్థనను మన్నించి ఆ విధంగానే దర్శనం ఇచ్చాడు. భగవంతుని విశ్వరూపాన్ని దర్శించాలని దేవతలు కూడా ఎల్లప్పుడు గొప్ప ఆశతో ఉంటారు. అయినా వారికి ఆ అదృష్టం కలగలేదు. అటువంటి భాగ్యాన్ని అర్జునుడు పొందినందుకు శ్రీకృష్ణుడు అతనిని పొగిడాడు.

(ఇదు వేఱుముణ్డో) భక్తి లేకుండా చేసే వేదాధ్యయనం మొదలైనవానిద్వారా, యాగం, దానం, హోమం, తపం మొదలైనవాని ద్వారా




భగవంతుని దర్శింపలేము. వేరు ఏ ఫలాన్ని ఆశించకుండా, వేరు ఏ దైవాన్ని ఆశ్రయించకుండా అనన్యమైన భక్తిని కలిగి ఉంటే శాస్త్రసహాయంతో భగవంతుని యథార్థమైన స్వరూపాన్ని తెలియగలరు. అప్పుడే ఆ స్వామిని

యథార్థంగా సాక్షాత్కరించుకోవడానికి, ఆశ్రయించి యథాతథంగా అనుభవించడానికి వీలవుతుంది.

(నల్లార్ కళ్ కాణ్బర్) వేదాధ్యయనం మొదలైన సకల కర్మలను భగవంతుని ఆరాధనా రూపాలుగా భావించి, వాటిని ఆచరించేవాడై, భగవంతుని పట్ల మిక్కిలి ప్రేమతో అతనికి కైంకర్యాన్ని చేస్తే తప్ప ప్రాణాలను భరించలేనందున ఎల్లప్పుడు కైంకర్యాలను చేసేవాడై, భగవంతుని యందే భక్తి కలవాడు అయినందున వేరొకకరియందు భక్తి లేనివాడై, సంసారంలో ఉండే అల్ప సుఖాలను లక్ష్యపెట్టకుండా భగవంతుని విషయంలోనే ఆశను కలవాడై ఉండడంచేత, తనకు కలిగే దుఃఖాలకు తన పాపమే కారణమని భావించేవాడై ఉన్నందున, సకల ప్రాణులు భగవంతుని అధీనంలో ఉన్నాయి అని భావించడం వల్ల, ఏ ప్రాణి పట్ల విరోధ భావం లేనివాడై ఉండే అధికారి తన అజ్ఞానం, విపరీతజ్ఞానం అని వీటికి కారణమైన కర్మ మొదలైనవానిని అన్నిటిని సమూలంగా పోగొట్టుకొని, భగవంతుని మాత్రమే అనుభవిస్తాడు.

ఈ అంశాలను శ్రీకృష్ణుడు పదకొండవ అధ్యాయంలో అర్జునునకు ఉపదేశించాడు.

## ద్వాదశాధ్యాయసారవివరణం

13. తన్కళ్లిల్ పత్తి తాళాతతుమ్ అదన్ కారణమామ్
ఇన్కుణర్ శిన్దైయు మీదటియాక్క వ్వడిమైకళుమ్
తన్ కరుమఙ్గళ్ అటియాతవర్క్కు ఇలకు నిలైయుమ్
తన్కళల్ అన్బర్క్కు నల్లవన్ శాఱ్ఱినన్ పార్త్తనుక్కే ●

తన శ్రీచరణాలలో భక్తియోగాన్ని అనుష్ఠించినవారికి అనుకూలుడైన శ్రీకృష్ణుడు, అర్జుననకు - ఈశ్వరుడైన తన శ్రీచరణాలలో అనుష్ఠించే భక్తియోగం ఫలాన్ని ఇవ్వడంలో ఆలస్యం చేయకపోవడాన్ని గూర్చి, ఆ భక్తియోగానికి కారణమైన భగవానుని (తన) కల్యాణగుణాల భావనను గూర్చి, దానిని చేయలేనివారు చేయదగిన ఆ కైంకర్యాలను గూర్చి, జీవునకు విధించిన ఆ భగవత్కైంకర్యాలను చేయడం తెలియనివారికి సులభమైన ఆత్మధ్యానమనే ఉపాయాన్ని గూర్చి ఉపదేశించాడు.

**వ్యాఖ్యానం:** (తన్ కళ్లిల్ పత్తి తాళాదదుమ్) శరీర యాత్రను సాగించడానికి అవసరమైన పైరును వేయుట మొదలైన పనులను, ప్రాణాధారణకు అవసరమైన రీతిలో భుజించడం మొదలైన కార్యాలను, యాగం, దానం, హోమం మొదలైన వైదిక కర్మలను భగవానుని విషయంలో సేవా రూపంగా ఆచరించి ఆ స్వామికి సమర్పించి, ఆ స్వామియందే మనసు లగ్నం చేసి, వేరే ఏ ఫలాన్ని ఆశించకుండా ఆ స్వామినే ప్రాప్యంగా భావించి, ఆ స్వామి ధ్యానం, అర్చనం, నమస్కారం, కీర్తనం, స్తవం మొదలైనవానిని చేసి ఉపాసించడం అనే భక్తి యోగాన్ని ఆచరించేవానిని అనుగ్రహించి, అతనికి మోక్షాన్ని పొందడానికి అంతవరకు అడ్డుగా ఉండే సంసార సముద్రం నుండి చాలా తొందరగా తీరాన్ని చేర్చి, భగవంతుడు ముక్తిని ప్రసాదిస్తాడు. జీవాత్మను ఉపాసించేవాడు కూడా ప్రకృతి సంబంధంలేని జీవాత్మ యొక్క సాక్షాత్కారాన్ని ఫలంగా పొందినా, అతడు చిరకాలం శరీరాన్ని ఆత్మగా తలచినవాడు కనుక, అతడు సకల ఇంద్రియాల కార్యాలను నియంత్రించి ఆత్మలలో మనసును లగ్నం చేయడం చాలా కష్టం. అందుచేత అతడు ఫలం పొందడానికి చాలా ఆలస్యం అవుతుంది. అందుచేత

దానికంటే సులభమైన, గొప్ప ఫలాన్ని శీఘ్రంగా ఇచ్చే భక్తి యోగాన్ని ఆచరించాలి.



(అదన కారణముమ్...శింద్రైయుమ్) లౌకిక విషయాలలో అభినివేశాన్ని పొందడం అలవాటుపడిన మనస్సును కొత్తగా భగవానుని విషయంలో తొందరగా ఏకముఖంగా లగ్నం చేయడం చాలా కష్టమే అయినా, ఆ భగవంతుని కళ్యాణ గుణాలను మిక్కిలి ప్రేమతో స్మరించి భావించడం అలవాటు పడితే మనస్సు స్థిరంగా సమాధానపడి భగవంతుని పొందవచ్చు.

(ఈదటియార్ క్కు అవ్వడిమైకళుమ్) చిరకాలంగా అలవాటు పడినవి, కంటికి కనిపించేవి, త్వరలో లభించేవి అయిన తీయని విషయాలలో అభినివేశం

కల మనసును భగవంతునిపై లగ్నం చేయడం అంత తేలిక కాదు. అందువల్ల ఏదైనా అన్య కార్యాలను చేయడంలో గల పూర్వ సంస్కారంవల్ల మనసు ఆసక్తి కలిగి ఉంటుంది. అంటే, ఆలయ నిర్మాణం, నందనవనం నిర్మాణం, దీప ప్రజ్వాలనం, తిరువారాధన చేయడం, తిరునామానుసంధానం, ప్రదక్షణం చేయడం, స్తుతించడం, నమస్కరించడం మొదలైన సేవలను చేయాలి. అప్పుడు ఆయా కైంకర్యాలు మిక్కిలి పవిత్రమైనవి కనుక, ఒక్కొక్క కైంకర్యంలోను భగవంతునకు సంబంధించి స్మృతి కలుగుతుంది. అందువల్ల అటువంటి అలవాటును తొందరగా పొంది మనస్సును లగ్నం చేసి, తరువాత వాటి ద్వారా భగవంతుని చేరవచ్చు.

(తన్ కరుమంగళ్....నిలైయుమ్) తనకు అవసరం లేని కార్యాలలో మనసును లగ్నం చేయడం అలవాటు పడినవానికి భక్తి యోగానికి మూలమైన భగవంతునికి కైంకర్యంలో మనసు ప్రసరింప చేయలేకపోతే, వేరు ఏ ఫలాన్ని ఆశించకుండా, భగవంతుని ఆనందం కోసమే కర్మయోగాన్ని ఆచరిస్తే, దానివల్ల పాపం తీరి, మనసులో ఉండే కోరిక, క్రోధం మొదలైన దోషాలు తీరిపోతాయి. తరువాత జీవాత్మకు సంబంధించిన ధ్యానం ఏర్పడి అవిద్యాదులు నశించి భగవంతునకు శేషమై ఉండే ఆత్మస్వరూపాన్ని భగవానునకు సమానమైన స్థితిలో సాక్షాత్కరించుకోవచ్చు. తర్వాత భక్తియోగం ఇక దేనిని ఆశించకుండా తానే సిద్ధిస్తుంది.

ఇక్కడ కర్మయోగాన్ని ఆచరించేవాడు గ్రహించవలసిన దయ, క్షమ, అణకువ మొదలైన సద్గుణాలు తెలుపపడ్డాయని తెలియాలి.

ఈ విధంగా మిక్కిలి మహిమ గల భక్తియోగం మోక్షానికి ఉపాయంగా, అనుష్ఠించేటప్పుడు చాలా తీయనిదిగా ఉన్నందున, స్వయంప్రాప్యం అవుతుంది. దీనిని అనుష్ఠించే అధికారులు భగవంతునకు మిక్కిలి ఇష్టమైనవారు అనే అర్థం **"తన్ కழల్ అన్బర్ క్కు నల్లవన్"** అనే ప్రయోగం ద్వారా తెలుస్తున్నది.

ఈ విషయాలను అన్నిటినీ శ్రీకృష్ణుడు అర్జునునకు పన్నెండవ అధ్యాయంలో తెలియజేశాడు.

## త్రయోదశాధ్యాయసారవివరణం

14. ఊనిన్ పడియు ముయరిన్ పిరివు ముయిర్ పెఱువార్
ఞానమ్ పెఱువకైయుమ్ ఞానమీన్ఱ ఉయిర్ ప్పయనుమ్
ఊనిన్ఱదళ్కుడియుమ్ ఉయిర్ వేఱిడు ముళ్ విరకుమ్
తేనిన్ఱ పాదన్ తెళివిత్తనన్ శిలై ప్పార్త్తనుక్కే ●

తేనెను స్రవించే శ్రీచరణపద్మాలను కల శ్రీకృష్ణుడు ధనుర్ధారి అయిన అర్జునునకు - శరీరంయొక్క స్వరూపాన్నిగూర్చి, జీవాత్మ శరీరం కంటే భిన్నమై (విలక్షణమై) ఉండడాన్ని గూర్చి, ఆత్మను పొందేవారు (దర్శించేవారు) ఆ ఆత్మయొక్క జ్ఞానాన్ని పొందడానికి కావలసిన ఉపాయాలను గూర్చి, ఆత్మను తెలియడానికి సాధనమైన గుణాలతో పొందబడే ఆత్మ అనే ప్రయోజనాన్ని గూర్చి, శరీరం నిలచి ఉండే సంసారానికి గల కారణాన్ని గూర్చి, ఆత్మను శరీరం నుండి వేఱుగా దర్శించ డానికి కావలసిన, మనస్సుతో అనుష్ఠించవలసిన ఉపాయాన్ని గూర్చి స్పష్టం చేశాడు.

**వ్యాఖ్యానం:** (ఊనిన్ పడియుమ్) జీవుడు ఏదో ఒక ఆధారాన్ని ఆశ్రయించుకుని భోగాలను అనుభవించ వలసి ఉంటుంది. కనుక, దానికి తగిన చోటు ఆయిన శరీరం క్షేత్రం అనబడుతుంది. లోకంలో విత్తనాన్ని నాటి ఫలాన్ని పొందే చోటుకు క్షేత్రం అని పేరు. కర్మ అనే విత్తనం వల్ల ఫలాన్ని జీవుడు ఈ శరీరంలోనే పొందుతున్నాడు. అందుచేత ఇది క్షేత్రం అనబడుతుంది. ఇటువంటి శరీరం అనేది భూమి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం అనే పంచభూతాలతో, ప్రకృతి, మహాన్, అహంకారం అనే తత్త్వాలతో నిర్మింప బడుతున్నది. జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు అయిదు, మనసు అనే 11 ఇంద్రియాలు, రూప, రస, గంధ, శబ్ద, స్పర్శాలు అనే ఐదు విషయాలు - అనే వీటికి శరీరం స్థానం. ఇచ్ఛ, ద్వేషం, సుఖం, దుఃఖం అనే ఈ నాలుగు జీవుని ధర్మభూత జ్ఞానం యొక్క వికారాలే అయినా, అవి జీవాత్మ శరీరంతో చేరడం వల్ల అవి ఏర్పడుతున్నాయి గనుక, శరీర వికారాలు అనబడుతున్నాయి. జీవుడు సుఖదుఃఖాలను అనుభవించడానికి తగిన స్థానంగా ఉండడమే శరీరానికి

కల ప్రయోజనం. పంచభూతాల కూడికయే శరీరం.

(ఉయిరిన్ పిరివుమ్) శరీరంలో ఉండే అవయవాలలో "నా తల, నా చేయి'' అని రీతిలో వేరు వేరుగా ఉండే అవయవాలను గూర్చి, "నా శరీరం'' అనే విధంగా మొత్తం శరీరాన్ని గూర్చి జ్ఞానం కలిగిన తర్వాత, "దీనిని నేను తెలిసి కొంటున్నాను'' అనే భావన కలుగుతుంది. "ఇది" అనేది తెలియబడే వస్తువు. దీనికంటే విలక్షణుడై ఉండేవాడు జ్ఞాని అయిన జీవుడు. అతడు క్షేత్రజ్ఞుడు అనబడుతున్నాడు.

(ఉయిర్ పెఱువార్ నమ్ పెరువకైయుమ్) శరీరాన్ని విడచి పరిశుద్ధమైఉండే ఆత్మ స్వరూపాన్ని తెలుసుకోవడానికి కొన్ని గుణాలు ఆవశ్యకాలు. అవి ఏవి? అంటే,

1) విద్య, సంపద, కులం మొదలైనవి నిండుగా ఉండటం చేత పెద్దలను అవమానించే విధంగా గర్వాన్ని పొందకుండా ఉండడం.

2) శాస్త్రాలలో విధింపబడిన, తన కర్తవ్యమని తలచి చేయవలసిన ధర్మాలను తనను ఇతరులు ధర్మిష్ఠుడు అని పొగడాలని భావించి చేయకపోవడం.

3)మనసు, వాక్కు, దేహం అనే మూడు కరణాలతో ఇతరులకు దుఃఖాన్ని కలిగించకపోవడం.

4) ఇతరులు తనను బాధించినా వారిపై తన మనసులో వ్యతిరేక భావాన్ని పొందకపోడడం.

5) ఇతరుల పట్ల మనసులో ఒకటి, మాటల్లో ఒకటి, చేతలలో ఇంకొకటి అనే విధంగా కాకుండా, త్రికరణాలతో ఒకే విధంగా ఉండడం.

6) ఆత్మ స్వరూపాన్ని గూర్చిన జ్ఞానాన్ని ఉపదేశించే ఆచార్యుని దగ్గర వినయంగా నమస్కరించి, సందేహాలను ప్రశ్నించి సమాధానాలను విని తెలిసికొని భక్తితో చిరకాలం ఆచార్యసేవ చేయడం.



7) కోరిక మొదలైన దోషాలతో మనసు కలుషితం అవుతున్నది. అసత్య భాషణం మొదలైన వాటి చేత వాక్కు అపవిత్రం అవుతున్నది. శాస్త్రాలలో నిషేధించబడిన వస్తువులను స్వీకరించడం చేత శరీరం అపవిత్రం అవుతున్నది. ఈ మూడు విధాలైన దోషాలు లేకుండా, ఆత్మజ్ఞానాన్ని పొందడానికి తగిన ఉపాయాలను ఆచరించడానికి యోగ్యుడై ఉండడం.

8) వేదాంతాలలో తెలుపబడిన తత్త్వాల విషయంలో ఇతర మతాల వారి మాటల వల్ల మనసులో సందేహాన్ని పొందకుండా నిశ్చయమైన జ్ఞానాన్ని కలిగి ఉండడం.

9) సహజంగా బాహ్య విషయాలలో ప్రవేశించే మనసును ఆత్మ స్వరూపంలో తప్ప ఏ విషయంలోనూ లగ్నం కాకండా నియంత్రించడం.

10) ఆత్మ తప్ప మిగిలిన విషయాలు అన్ని దుఃఖంతో పొందవలసి రావడం, దుఃఖాన్ని పొంగించడం, నశించే స్వభావాన్ని కలిగి ఉండడం మొదలైన దోషాలను కలిగి ఉన్నందున ఆ విషయాన్ని మాటిమాటికి భావించి, వాటి విషయంలో ఆసక్తిని పొందడానికి భయపడడం.

11) శరీరాన్ని ఆత్మగా భావించడం అనే శరీరాత్మ భ్రాంతిని, తనది కాని వస్తువును తనది అని భావించడం అనే మమకారాన్ని కలిగి లేకపోవడం.

12) శరీరంతో ఉండేటప్పుడు జన్మ, మరణం, ముసలితనం, వ్యాధి అనే వీటివల్ల కలిగే దుఃఖాలు అనివార్యాలు అని గ్రహించి, ఆ విషయాన్ని పలుమార్లు భావించడం.

13) ఆత్మ తప్ప తనదిగా తోచు ఏ విషయంలోనూ సంగం లేకపోవడం,

14) పుత్రులు, భార్య, గృహం మొదలైనవాని విషయంలో శాస్త్రాలలో చెప్పబడిన రీతిలో ఆవశ్యకమైన సంబంధాన్ని మాత్రం కలిగి ఉండి, అధికమైన సంబంధం లేకపోవడం

15) తన సంకల్పంచే వచ్చే, పుత్రుడు భార్య, మొదలైనవారి విషయంలో ఇష్ట ఫలప్రాప్తివల్ల ఏర్పడే సంతోషం, ఆశించని విరుద్ధమైన ఫలం కలగడం చేత దుఃఖం లేకుండా సమానమైన స్థితిని కలిగి ఉండడం.

16) అన్య దేవతలను విడిచిపెట్టి శ్రీకృష్ణునియందే భక్తిని కలిగి ఉండడం.

17) జన సాంద్రత లేనిచోట ఏకాంతంగా ఉండడం.

18) ఆత్మకు సంబంధించిన జ్ఞానాన్ని నిరంతరంగా పొందడం.

19) సత్వగుణం లేనివారి విషయంలో విరక్తిని పొందడం.

20) తత్వజ్ఞానం కలిగించే చింతనలో ఆసక్తిని కలిగి ఉండడం.

ఇవి ఆత్మసాక్షాత్కారాన్ని పొందడానికి సాధనాలు.

(నమీన్త ఉయిర్ ప్పయనుమ్) పూర్వం తెలియజేసిన సాధనాలతో సాక్షాత్కరించుకోవలసిన జీవుని స్వరూపం పలు విధాలుగా స్పష్టం చేయబడుతున్నది.

జీవునకు పుట్టుక లేదు. మరణం లేదు. భగవంతునకు శరీరం కనుక ఆ స్వామికి శేషమై ఉండే స్వభావమే ఆత్మకు సహజం. శరీరం కంటే విలక్షణం అయిన జీవుడు సంసార బంధం తీరిన దశలో ఏ సంకోచం లేని జ్ఞానాన్ని కలవాడు అవుతాడు. స్వరూపం శరీరం, ఇంద్రియాలు మొదలైన వానితో కూడి కార్య దశలో సత్తు అని, వీనిని లేకుండా ఉండే కారణదశలో ఉన్నప్పుడు అసత్తు అని చెప్పబడుతున్నది. అయితే, సంసార బంధం లేక పరిశుద్ధమై ఉండే స్థితిలో కర్మవల్ల ఏర్పడే ఆ రెండు దశలు లేనందువల్ల ఆత్మ స్వరూపం సత్తు అని గాని, అసత్తు అని గాని చెప్పబడదు. ఇంతేకాక, పరిశుద్ధమైన దశలో జ్ఞానంలో శక్తిలో ఏ సంకోచం లేకుండా భగవంతునకు వశమై ఉన్నందున, అంతటా చేతులు, కాళ్ళు, కళ్ళు, తల, ముఖం, చెవులు అనే వీటి కార్యాలను చేయగలుగుతున్నది. తన ధర్మభూతజ్ఞానంతో ఆత్మ అన్ని వస్తువులలోను వ్యాపించి ఉంటుంది. పరిశుద్ధమైన ఆత్మస్వరూపానికి ఇంద్రియాలు లేకపోయినా ఇంద్రియ వ్యాపారాలతో అది అన్ని విషయాలను తెలియగలిగినదిగా ఉంటుంది. సహజంగా ఇంద్రియాల వ్యాపారాలు లేకుండానే అన్నిటినీ అది తెలియకగలిగినది. సహజంగా దేవతలు మానవులు మొదలైన శరీరాలలో సంబంధం లేనిదై ఉంటుంది. అయితే, అటువంటి శరీరాలను ధరించి ఉండే శక్తి కలిగి ఉంటుంది. ఇది కర్మ సంబంధంతో సత్వం మొదలైన గుణాలను అనుభవిస్తుంది. పరిశుద్ధమైన స్థితిలో అనుభవించే శక్తిని ఎల్లప్పుడూ కలిగిఉంటుంది. పరిశుద్ధమైన ఆత్మకు శరీరం లేనందున శరీరానికి బయటే ఉంటున్నది. ముక్త దశలో ఇష్టం వచ్చినట్టుగా రూపాలను ధరించేటప్పుడు శరీరం లోపల కూడా ఉంటుంది. సహజంగా పాదాలతో నడిచే శక్తి లేనిది శరీరంతో ఉండేటప్పుడు పాదాలతో నడవగలిగి ఉన్నది. ఆత్మ శరీరంలో ఉన్నా మిక్కిలి

సూక్ష్మం అయినది కనుక, అది దేహం కంటే విలక్షణమైనది - అని సంసారులు తెలుసుకోవడం కష్టం. ఆత్మను సాక్షాత్కరించుకోవడానికి సాధనాలుగా పూర్వం చెప్పబడిన సద్గుణాలను పొందకుండా చెడ్డ గుణాలు గలవారికి తమ దేహంలో ఉన్న ఆత్మయొక్క స్వరూపాన్ని తెలుసుకోవడానికి వీలు కాదు. అటువంటి సద్గుణాలను కలవారికి సమీపంలోనే ఉండి సాక్షాత్కరింప చేసికోవడానికి వీయినది. జీవుడు శరీరాన్ని ధరించి ఉండడం చేత, అన్నం మొదలై వానిని



భుజించడం చేత, ధరించబడే శరీరం కంటే, భుజించబడే అన్నం కంటే వేరు అయినది - అని తెలిసికోవచ్చు. అన్నం మొదలైనవానిని భుజించిన తరువాత

అవి రేతస్సు, గర్భం అని పలు విధాలుగా పరిణామాన్ని పొందడానికి జీవుడే కారణం అవుతున్నాడు. అందువల్ల పరిణామం చెందే వస్తువు కంటే ఈ పరిణామానికి కారణం అయినా జీవుడు భిన్నుడు అవుతున్నాడు. దీపము, సూర్యుడు, రత్నం మొదలైన తేజస్సులను కూడా ఆత్మయే తన ధర్మ భూత జ్ఞానం ద్వారా ప్రకాశింప చేస్తున్నది. ప్రకృతి కంటే అది భిన్నమై, అనుభవింప దగినదిగా ఉన్నది. కావున ముఖ్యమై ఉండదగినది, జ్ఞానస్వరూపంగానే ఆత్మ తెలియబడుచున్నది. ప్రాణుల హృదయాలలో తాను సాక్షాత్తుగా, మిగిలిన అవయవాలలో ధర్మభూత జ్ఞానం ద్వారా ఉంటుంది, ఇటువంటి ఆత్మ స్వరూపాన్ని పూర్వం తెలిపిన గుణాలనే సాధనాల ద్వారా సాక్షాత్కరించుకోవచ్చు.

(ఊన్ నిన్ఱదఱ్కుడియుమ్) దేవతలు, మానవులు మొదలైనవారి శరీరాలు ప్రకృతి యొక్క పరిణామ రూపాలే. ఆయా శరీరాలలో జీవుడు ఉండడంవల్ల, ఆ శరీరాలతో సంబంధం వల్ల ఏర్పడిన సత్వాది గుణములచే కలిగే సుఖదుః ఖాలలో సంబంధం కలుగుతున్నది. దుఃఖంలో కూడా కూడా సంబంధం కలగడానికి కారణం ఏమంటే దుఃఖాన్ని సుఖమని గ్రహించడమే. జీవుడు దానికి కారణమైన పుణ్య పాపాలను చేస్తున్నాడు. తరువాత ఆ పుణ్య ఫలాన్ని అనుభవించడానికి గొప్పవి, లేదా, హీనమైనవి అయిన జన్మలలో తన కర్మకు తగినట్లు జన్మిస్తున్నాడు. మళ్ళీ కర్మలను చేస్తున్నాడు మళ్ళీ ఆ కర్మలకు తగినట్లు పుడుతున్నాడు. పూర్వం తెలిపిన ఇరవై గుణాలను సంపాదించి, వాటివల్ల ఆత్మసాక్షాత్కారాన్ని పొందేవరకు జీవుడు ఈ విధంగా సంసార సముద్రంలో పరిభ్రమిస్తూనే ఉంటాడు. అందుచేత సత్వం మొదలైన గుణాల వల్ల ఏర్పడే సుఖదుఃఖాలతో సంబంధాన్ని కలిగి ఉండడమే సంసార బంధానికి మూల కారణం అవుతున్నది.

(ఉయిర్ వేఱిడుముళ్ విరకుమ్) లోకంలో స్థావరాలు, జంగమాలు అనే వస్తువులు అన్నీ శరీరం, జీవుడు ఒకటిగా చేరి జన్మించినవే. జీవునకు, 'మానవశరీరాన్ని కలిగి ఉండడం, దేవశరీరాన్ని కలిగి ఉండడం' మొదలైన ధర్మాలతో సంబంధం లేదు. ఆయా దేహాలు, ఇంద్రియాలు, మనసు

మొదలైనవానికి ఆత్మ నియామకుడు. ఇటువంటి ఆత్మను, జ్ఞానాన్ని కలిగినవానినిగా, జ్ఞానస్వరూపునిగా, శరీరం నశించినా తాను నశించనివానినిగా తెలియాలి. జీవుడు చేసే ముడుచుకోవడం, చాచడం మొదలైన కార్యాలను అన్నిటిని ప్రకృతిచే చేయబడేవిగానే తెలియాలి. జ్ఞానస్వరూపుడై ఉండే ఆత్మ కర్మలను చేసే కర్త కాలేడని తెలియాలి. జీవునకు ఏర్పడే ప్రకృతి సంబంధం, అతడు శరీరంలో నియామకుడై ఉండి, దానిని ఆయా కార్యాలలో ప్రేరేపించడం, దానిని వినియోగించడం, దానివల్ల కలిగే సుఖదుఃఖాలను అనుభవించడం అనే ఇవి అన్నీ కర్మ వలన ఏర్పడుతున్నాయని తెలియాలి. దైవత్వం, మనుష్యత్వం, హ్రస్వత్వం, దీర్ఘత్వం మొదలైన స్వభావాలు శరీరానికి సంబంధించినవి తప్ప, ఆత్మకు చెందినవి కావు అని తెలియాలి. జీవునకు పుత్రుడు, పౌత్రుడు మొదలైన మార్పులు అన్ని ఏర్పడడం ప్రకృతి వల్లనే తప్ప జీవునకు వాటితో ఏ సంబంధం లేదు. జీవుడు ఎవరిచేతా సృష్టింపబడనందున నాశనం లేనివాడు. సత్వం మొదలైన గుణాలు ఆత్మలో లేవు. అందువల్ల ఏ కార్యంలోనూ కర్తగా కాకుండా, శరీరంలో ఉండేటప్పుడు దానిలోని దోషాలు తనలో సంక్రమించకుండా జీవుడు ఉంటాడు. ఆకాశం అన్ని వస్తువులతో కలసి ఉన్నా అది మిగిలిన వస్తువుల కంటే సూక్ష్మమై ఉండడం చేత ఆయా వస్తువుల గుణాలు కానీ, లేక, దోషాలు కానీ ఆ ఆకాశంలో సంక్రమించవు. ఆ విధంగానే, ఆత్మ స్వరూపం దేవ మనుష్యాది శరీరాలు అన్నిటిలో ఉన్నా, అది ఆకాశంకంటే చాలా సూక్ష్మమైనది కావడంచేత, శరీరంలోని దోషాలు దానికి చెందవు. ఒక్కడే సూర్యుడు తన ప్రకాశంతో అన్ని వస్తువులను ప్రకాశింపచేసేటట్లు, జీవుడు లోపల, బయట కాళ్లు మొదలు తల వరకు గల శరీరాన్ని అంతటినీ తన జ్ఞానంతో ప్రకాశింప చేస్తాడు. అందుచేత అనేక అవయవాల సమూహం అయిన శరీరం కంటే, ఒక్కడై ఉండి దానిని తెలిసికొనేవాడై ఉండే జీవాత్మ విలక్షణుడు అని తెలుస్తున్నది.

ఈ విషయాలను అన్నిటినీ శ్రీకృష్ణుడు పదమూడవ అధ్యాయంలో అర్జునునకు ఉపదేశించాడు.

## చతుర్దశాధ్యాయసారవివరణం

15. ముక్కుణమే ఉయిర్ముఱ్ఱవుమ్ కట్టిడ మూణ్డమైయుమ్
ముక్కుణమే యనైత్తుమ్ వినైకొళ్ళ ముయన్దమైయుమ్
ముక్కుణ మాయై కడత్తలుమ్ ముక్కతి తన్దళిప్పుమ్
ముక్కుణ మఱ్ఱపిరాన్ మొழిన్దాన్ ముడియోన్దనక్కే ●

త్రిగుణరహితుడైన భగవానుడు కిరీటాన్ని కల అర్జునునకు - సత్త్వం, రజస్సు, తమస్సు - అనే మూడు గుణాలే జీవాత్మలను అన్నిటిని సంసారంలో కట్టివేయడానికి ప్రయత్నించడాన్ని గూర్చి, ఆ మూడు గుణాలే కర్మలన్నీ తమచే చేయిస్తున్నాయని భావించేటట్లు చేయడాన్ని గూర్చి, త్రిగుణాలనే ప్రకృతి సంబంధాన్ని అతిక్రమించడాన్ని గూర్చి, ఐశ్వర్యం, కైవల్యం, మోక్షం - అనే మూడు గతులను ఇచ్చి తాను రక్షించే రీతినిగూర్చి ఉపదేశించాడు.

**వ్యాఖ్యానం:** (ముక్కుణమే...మూణ్డమైయుమ్) సత్త్వగుణం వస్తువుల స్వభావాన్ని తెలియడానికి, సుఖాన్ని అనుభవించడానికి, ఆరోగ్యాన్ని పొందడానికి కారణం అవుతుంది. ఈ సత్త్వగుణం జీవునకు జ్ఞానంలో, సుఖంలో సంబంధాన్ని కలిగిస్తున్నది. ఆ సంబంధం చేత జీవుడు వానికి సాధనమైన లౌకిక, వైదిక కర్మలను చేస్తున్నాడు. తరువాత, వాటి ఫలాలను అనుభవించటానికి సాధనాలైన జన్మలను పొందుతున్నాడు. అందుచేత జీవునకు సుఖంలో, జ్ఞానంలో సంగాన్ని కలిగించడం ద్వారా, సంసారం బంధంలో అతడు చిక్కుకొనేటట్లు సత్త్వగుణం చేస్తున్నది.

రజోగుణం స్త్రీపురుషులకు ఇరువురికి ఒకరిపై ఇంకొకరికి ప్రేమను కలిగిస్తున్నది. శబ్దాది సకల విషయాలలో ఆశను, పుత్ర మిత్రాదులను చేరాలనే కోరికను కలిగిస్తున్నది. జీవుడు కార్యాలను చేయాలని ప్రేరణ పొంది దాని తర్వాత వాటిని చేస్తున్నాడు. ఆ కార్యాలు పాపాలు గాను, పుణ్యాలు గాను ఉన్నందున, వాటిని అనుభవించడం కోసం సాధనాలైన జన్మలలో జీవుడు జన్మించేటట్లు అవి చేస్తున్నవి. అందుచేత, కార్యాలలో సంగాన్ని కలిగించి, తన్మూలంగా జన్మ కలిగేటట్లు చేసి, రజోగుణం జీవునకు సంసార బంధాన్ని

కలిగిస్తున్నది.

వస్తువుల యథార్థతత్వాన్ని తెలియలేక విపరీతంగా తెలుసుకోవడం చేత పాపం చేయడం తటస్థించి, దానివల్ల తమోగుణం ఏర్పడుతున్నది. ఆ గుణం వల్ల మళ్ళీ విపరీత జ్ఞానం కలుగుతున్నది. ఈ తమోగుణం - చేయవలసిన కర్తవ్యాలను విడిచిపెట్టి వేరే కార్యాలను ప్రయత్నించడానికి కారణమైన ప్రమాదాన్ని, అజాగ్రత్త కార్యాలు చేయకుండా ఉండే సోమరితనాన్ని, ఇంద్రియాలను లౌకిక విషయాలలో మాటిమాటికి లగ్నం అయ్యేటట్టు చేసి అవి అన్ని అలసినప్పుడు వాటి నుండి విరమించడం అనే నిద్రను, స్వప్నాన్ని జీవునకు కలిగిస్తున్నది. ఆ విధంగా ఈ గుణం జీవునకు సంసార బంధాన్ని కలిగిస్తున్నది.

(ముక్కుణమే.....ముయ్యన్లమైయుమ్) జీవుడు సహజంగా పరిశుద్ధమైన వాడు. కర్తృత్వం లేనివాడు. జ్ఞాన స్వరూపుడై ఉండేవాడు. ఇటువంటి ఆత్మకు పుణ్యపాపాలు మొదలైన కర్మలలో కర్తృత్వం సహజంగా లేదు. అది సత్వాది గుణాల సంబంధం చేత ఏర్పడుతున్నది. గుణాల సంబంధం పూర్వ కర్మల వల్ల కలుగుతున్నది. నిజానికి కర్తృత్వం అనేది సత్వం మొదలైన మూడు గుణాలకే ఉన్నది.

(ముక్కుణమాయై క్కడత్తలుమ్) వేరు దైవం ఎవరిని మనసులో కూడా భావించకుండా భక్తి యోగంతో భగవంతుని స్థిరంగా ఉపాసించేవాడు ఈ సత్వాది గుణాల సంబంధాన్ని పోగొట్టుకుంటాడు.

(ముక్కతి...తందళిప్పుమ్) భగవానుని విషయంలోని భక్తికి అంగమైన ప్రపత్తిని ఆచరించి, తరువాత భక్తి యోగాన్ని అనుష్ఠించేవాడు చిరకాలం అనుభవింపబడేది, ఇంద్రుడు, బ్రహ్మ మొదలైనవారి భోగాల కంటే చాలా గొప్పది అయిన ఐశ్వర్యాన్ని, ఈశ్వరుని వలె పరిశుద్ధమైన ఆత్మను అనుభవించడం అనే కైవల్యాన్ని, భగవంతుని నిరంతరంగా అనుభవిస్తూ నిత్య కైంకర్యం చేయడం అనే మోక్షాన్ని భగవంతుని వల్ల పొందుతాడు.

ఈ విషయాలను శ్రీకృష్ణుడు పధ్నాలుగవ అధ్యాయంలో అర్జునునకు ఉపదేశించాడు.

## పంచదశాధ్యాయసారవివరణం

16. మూవెట్టినుమ్ అదిన్ మోక మడైన్ద ఉయిర్కళిలుమ్
నావెట్టెழுత్తోడు నల్వీడు నణ్ణిన నమ్బరిలుమ్
మేవెట్టు వన్కుణ విణ్ణోర్కళిలుమ్ విశయనుక్కు
త్తావిట్టులకళన్దాన్ తన్నై వేఱెన్ఱు శాற்றி నన్●

త్రివిక్రమావతారంలో తన పాదాలతో లోకాన్ని స్పృశించి కొలిచిన స్వామి అర్జునునకు - ఇరవై నాల్గు తత్త్వాల రూపంలోని ప్రకృతి కంటే, ఆ ప్రకృతి సంబంధం వల్ల, అజ్ఞానాన్ని పొందిన బద్ధజీవుల కంటే, జిహ్వతో ఉచ్చరించ వలసిన అష్టాక్షరియొక్క అనుసంధానంతో గొప్పమోక్షాన్ని పొందిన, ఉన్నతులైన ముక్తుల కంటే, ఎనిమిది బలమైన (నిత్యమైన) గుణాలను కల నిత్యసూరుల కంటే తాను విలక్షణుడనని తెలిపాడు.

**వ్యాఖ్యానం:** (మూవెట్టినుమ్) ప్రకృతి, మహాన్, అహంకారం, జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు, మనసు, పంచభూతాలు తన్మాత్రలు 5 - ఈ విధంగా **24** తత్త్వాలు తనకు శరీరంగా కలిగిన భగవంతుడు ఆ తత్త్వాలకంటే వేరుగా ఉన్నాడు.

(అదిల్ మోకమడైంద ఉయిర్ కళినుమ్) ప్రకృతి సంబంధం తీరకుండా ఉన్నవారై, సంసార మండలంలో పరిభ్రమించే కర్మఫలాలను అనుభవించే బద్ధులు.

(నా వెట్టెழுత్తోడు..నమ్బరినుమ్) సంసారంలో మొదట అలమటించి, తరువాత అష్టాక్షరీ మొదలైన రహస్యాలను గ్రహించి, ఉపాయాలను ఆచరించి, ముక్తిని పొందిన వారు ముక్తులు.

(మేవెట్టు.....విణోర్ కళినుమ్) ఏ సమయంలోనూ సంసార బంధం లేనివారై, భగవంతునివలెనే జన్మ, మరణాలు లేని వారై, ఎల్లప్పుడూ గుణాష్టకాన్ని కలిగి, జ్ఞానసంకోచం లేకుండా ఉండేవారు నిత్యసూరులు. భగవంతుడు ఈ విధంగా మూడు విధాలుగా ఉండే చేతనాల కంటే విలక్షణుడై, వారికి

అంతర్యామిగా ఉన్నవాడై, వారిని ధరించి, వారికి అందరికీ ఈశ్వరుడై ప్రకాశిస్తున్నాడు. ఈ కారణాల చేత అతడు వేదాలలో, స్మృతులలో పురుషోత్తముడుగా కీర్తింపబడుతున్నాడు.

ఈ అంశాలను శ్రీకృష్ణుడు అర్జునునకు పదిహేనవ అధ్యాయంలో ఉపదేశించాడు.

## షోడశాధ్యాయసారవివరణం

17. ఆణై మఱాదవర్ తేవర్ అల్లా వ*ழ*క్కోరశురర్
కోణై మరాత గుణచ్చెల్వ నీ కుఱిక్కోళ్ మఱైయై
ప్పేణియ తత్తువముమ్ పిణియ*ఱ్ఱ* కిరిశైకళుమ్
క్కాణిదనాల్ విశయా ఎన్ఱు కణ్ణ నియమ్బిననే ●

శ్రీకృష్ణుడు "అర్జునా! నా ఆజ్ఞను మీరనివారు దేవతలు. ఆ విధంగా కాక, నా ఆజ్ఞను దాటే ప్రవర్తనను కలవారు అసురులు. వక్రస్వభావం లేని, గుణాలనే సంపదను కలవాడా! నీవు వేదాన్నే ఆధారంగా కల్గినవాడవు కావాలి. కీర్తింపబడే తత్త్వాన్నిగూర్చి, ఫలంలో సంగం కల్గి ఉండడమనే దోషం లేని కర్మలను గూర్చి ఈ వేదంద్వారా తెలిసికో" - అని ఉపదేశించాడు.

**వ్యాఖ్యానం:** ఇంతకుముందు మూడు అధ్యాయాలలో చిదచిదీశ్వరులనే తత్త్వత్రయాల స్వరూపస్వభావాలు వివరించబడ్డాయి. ఇకమీదట మూడు అధ్యాయాలలో అనుష్ఠానానికి సంబంధించిన విషయాలు మొదలైనవి తెలుపబడుతున్నవి. వీటిలో నిశ్చయం శాస్త్రాల ద్వారా అని ఏర్పడాలి. మానవులు ఇటువంటి శాస్త్రాలకు కట్టుబడి నడవాలి. అందువల్లనే ఈ అధ్యాయంలో దేవాసురులు అనే విభాగం తెలుపబడి శాస్త్రాలకు కట్టుబడవలసిన స్వభావం తెలుపబడుతున్నది.

(ఆణై మఱాదవర్ దేవర్) భగవంతుని ఆజ్ఞారూపాలైన శాస్త్రాలను అనుసరించి నడుచుకునే వారు దేవతలనబడతారు. ఆ విధంగా వారు నడుచుకోవడమే దైవీ సంపద అనబడుతుంది. అటువంటి సంపద కలవారికి

కొన్ని గుణాలు కలుగుతాయి. అవి ఏవి? అంటే,

1) తరువాత కలుగబోయే దుఃఖానికి కష్టానికి ముందు కనిపించే కారణాన్ని చూడడం వల్ల కలిగే జ్ఞానానికి భయం అని పేరు. అది దైవీ సంపద కలిగిన వారికి ఉండదు.

2) రజస్సు, తమస్సు అనే గుణాలతో మనసు కలసి ఉండక కేవలం సాత్త్విక గుణాన్ని కలిగి ఉండడం.



3) సంసార సంబంధం లేకుండా ఉండే పరిశుద్ధమైన ఆత్మ స్వరూపానికి చెందిన వివేకం స్థిరంగా ఉండడం.

4) న్యాయమైన మార్గంలో సంపాదించిన ద్రవ్యాన్ని తగిన వ్యక్తికి ఇవ్వడం,

5) శబ్దాది విషయాలలో మనసు లగ్నం కాకుండా ఉండేటట్లు అలవాటు పడడం.

6) ఏ ఫలం ఆశించకుండా భగవంతుని ఆరాధన రూపాలుగా నిత్య నైమిత్తిక కర్మలను చేయడం.

7) సర్వేశ్వరుడు అయిన భగవంతుని ఆ స్వామిని ఆరాధించే క్రమం వేదం పూర్తిగా తెలుపుతున్నదని భావించి వేదాభ్యాసం చేయడం.

8) భగవంతుని ఆనందింపజేసే కర్మలను చేయడానికి తమకు యోగ్యతను కలిగించే చాంద్రాయణ, ఏకాదశి ఉపవాసం మొదలైన కర్మలను చేయడం.

9) ఇతరుల విషయంలో మనసు, వాక్కు, శరీరం అనే మూడు కరణాల ప్రవృత్తులలో ఒకే విధంగా ఉండడం.

10) తమను, ఇతరులను బాధించకుండా ఉండడం.

11) ప్రాణులకు హితాలై ఉన్నవి, తాము చూచినవి అయిన విషయాలను యధాతథంగా తెలుపడం.

12) ఇతరులను బాధించే స్వభావాన్ని లేకుండా ఉండడం.

13) తన మంచికి వ్యతిరేకమైన వస్తువులను విడిచిపెట్టడం.

14) బాహ్యేంద్రియాలను అల్పవిషయాల పట్ల ఆసక్తి కలుగకుండా ఉండేటట్లు అడ్డుకోవడం, ఆ విధంగా ప్రయత్నించడానికి అలవాటు పడడం.

15) ఇతరులకు బాధ కలిగించే మాటలను వారి వద్ద, లేక ఇతరుల వద్ద పలుకకపోవడం.

16) శత్రువు, స్నేహితుడు అనే తేడా లేకుండా అందరి దుఃఖాన్ని చూచి సహించలేక, దానిని తీర్చడానికి ప్రయత్నం చేయడం.

17) తగని శబ్దాది విషయాలలో ఆశ లేకపోవడం.

18) సజ్జనులతో సంబంధాన్ని పొందడానికి తగిన యోగ్యతను సంపాదించడం.

19) ఆశపడ తగని విషయాలను చూసినప్పటికీ మనసు ఏ విధంగానూ వాటిపట్ల ఆసక్తిని పొందకుండా ఉండడం.

20) తగని పనులను చేయడానికి సిగ్గు పడడం.

21) దుర్మార్గుల చేత అవమానింపబడడానికి వీలుగా పిరికితనాన్ని కలిగి ఉండకపోవడం.

22) ఇతరుల వల్ల తాను దుఃఖాన్ని పొందిన వారి విషయంలో వ్యతిరేకమైన భావాన్ని పొందకపోవడం.

23) ఎంత ఆపద వచ్చినా శాస్త్రీయాలైన కార్యాలను చేయడంలో స్థైర్యం కలిగి ఉండడం.

24) శరీరం, వాక్కు, మనస్సు అనే వీటికి ఆపవిత్రమైన వ్యక్తులతో సంబంధం, అపవిత్ర ద్రవ్యాలను ఉపయోగించడం మొదలైన వాని వలన అపవిత్రత కలుగుతుంది. అందువల్ల కర్మానుష్ఠానానికి యోగ్యత లేకుండా పోతుంది. అటువంటి స్థితి కలగకుండా కాపాడుకోవడం.

25) ఇతరులు తమ ఇష్టానుసారంగా నడుస్తూ ఉప్పటికీ వారిని అడ్డుకోక పోవడం.

26) తగని విషయంలో గర్వం లేకపోవడం.

(అల్లా వ***ఴ***క్కోర్ అశురర్) భగవంతుని ఆజ్ఞారూపాలైన శాస్త్రాలను వ్యతిరేకించి ప్రవర్తించే స్వభావాన్ని కలవారు అసురులు అనబడతారు. వారు ఆ విధంగా ప్రవర్తించడంలో ఆసక్తి కలవారు కనుక, ఆ విధంగా ప్రవర్తించడం ఆసురసంపద అనబడుతున్నది. ఇక వారు ఎటువంటి స్వభావం కలవారు అనే విషయం వివరింపబడుతున్నది.

ఆసురస్వభావం కలవారు భగవంతుని ఆజ్ఞప్రకారం నడుచుకోవాలి - అనే అభిప్రాయం కలిగి ఉండరు. తాము ధర్మిష్ఠులమని, ఇతరులు తమను పొగడాలని భావించి, ధర్మాన్ని ఆచరిస్తారు. లౌకిక విషయాలను, సుఖాలను

మితిమీరి అనుభవించి ఆనందించి, "ఇది చేయదగినది, ఇది చేయకూడనిది" అనే వివేకాన్ని కోల్పోతారు. వారికి ఆచార్యులను, భగవంతుని సేవించడం మొదలైనవాని వల్ల ఆనందం కలిగే అవకాశం లేదు. తమ విద్యకు, ఆభిజాత్యానికి, వీర్యానికి తగినట్లు కాకండా, మితిమీరిన గర్వాన్ని కలిగిఉంటారు. ఇతరులకు కష్టాన్ని కలిగించే స్వభావాన్ని కలవారై ఉంటారు. ఇతర మతాలలో ఆగమాలలో పరతత్వాన్ని గూర్చి, అవరతత్వం(చిదచిత్తులు) గూర్చి విపరీతంగా చెప్పబడిన వాటిని నమ్మడం చేత, వేదానికి విపరీతమైన ఆచారాలను కలిగి ఉండడం చేత, పరతత్వం, అవరతత్వం, కార్యం, అకార్యం మొదలైన విషయాలలో వివేకాన్ని కలిగి ఉండరు. స్వర్గం మొదలైన లౌకిక ఫలాలకు, మోక్షానికి వేదంలో చెప్పబడిన ధర్మాలను చాలాసార్లు బోధించినా తమోగుణం వల్ల వాటిని తెలుసుకోలేరు. వైదిక ధర్మాలను ఆచరించడం కోసం శాస్త్రాల ద్వారా ఏర్పాటు చేయబడిన అధికారం బాహ్యమని, అంతరమని రెండు విధాలు. ఆసురసంపదను కలవారివద్ద ఉండే అపవిత్ర ప్రవర్తనల అలవాటు వల్ల తప్పక చేయవలసిన కర్మలను చేయకపోవడం వల్ల వారికి భాహ్య శుద్ధి ఉండదు, ఆత్మ గుణాలు లేనందువల్ల ఆంతర శుద్ధి ఉండదు. యోగ్యతను కలిగించగలిగిన సంధ్యావందనం మొదలైన మంచి ఆచారాలు కూడా వారి వద్ద ఉండవు. వంచనను, హింసను సహజంగా కలవారు కాబట్టి, వారు తాము ఇష్టం వచ్చినట్లు ప్రాణులకు మంచిని పలకడం అనే సత్యం వారి వద్ద ఉండదు. ఈ లోకం అంతా బ్రహ్మ వల్ల పుట్టినది కావడంచేత బ్రహ్మ స్వరూపమని వారు భావించరు. ఈ లోకం అంతా పరమాత్మచే ధరింపబడుతునదని కూడా వారు అంగీకరించరు. ఈ లోకం అంతా సర్వేశ్వరునకు అణగి ఉన్నదని వారు భావించరు. బ్రహ్మ, శివుడు మొదలైన వారిని పరతత్వంగా భావించి పలుకుతారు. స్త్రీ పురుష సంయోగం చేత మనుషులు పశువులు మొదలైన జన్మలు ఏర్పడుతున్నాయి అని, ఈ విధంగా లేని జన్మ లేదని, అందుచేత లోకమంతా కామాన్ని కారణంగా కలిగినదని భావిస్తారు. ఈ విధంగా వీరు విపరీతజ్ఞానాన్ని కలవారై, తెలియబడే శరీరం కంటే తెలిసికొనే ఆత్మ వేరని భావించరు. తమ వాదాలతో తమనే కాక తమతో చేరే వారిని కూడా పాడుచేస్తారు. పొందడానికి సాధ్యంకాని వస్తువులను



పొందాలని ప్రయత్నించి అందుకోసం దొంగతనం మొదలైన దారులలో ధనాన్ని సంపాదించడానికి ప్రయత్నం చేస్తారు. కామ భోగం తప్ప వేరొక పురుషార్థం లేదనే భావంతో ఉంటారు. వందలకొలది ఆశలు అనే పాశాలతో బంధింపబడి కోపానికి వశం అవుతారు. అనిత్యమైన మార్గంలో ధనాన్ని సంపాదించడానికి ప్రయత్నం చేస్తారు. మోక్షానికి సాధనమైన పరమ పురుషుని ఆరాధనలో ఉండవలసిన శ్రద్ధ వారికి అనర్థాన్ని కలిగించేది, మిక్కిలి అల్పమైనది, క్షణికమైనది అయిన సుఖ అనుభవంలో ఏర్పడుతుంది. తమ జ్ఞానం, శక్తి, ధనం, కులం మొదలైన వానిని చూచి చాలా గర్వాన్ని పొందుతారు. ఈశ్వరుడు, అదృష్టం అనే వీటి సహకారం లేకుండానే కార్యాలను సాధించాలని చూస్తారు. వీరు తమను తామే పొగడుకుంటారు. అన్నిటినీ చేస్తున్నామని భావించి చివరికి ఏమీ చేయరు,. ఇటువంటి ఆసుర ప్రవృత్తిని కలవారిని భగవంతుడు నరకంలోకి తోస్తున్నాడు.

(కోణై మరాద కుణ శెల్వ) ఈ విధంగా శ్రీకృష్ణుడు దేవతలు, అసురులు

అనే విభాగాన్ని చేసి, వారి వారి స్వభావాలను తెలియజేయగానే అర్జునునకు తాను ఏ వర్గానికి చెందినవాడో తెలియ లేనివాడై సందేహాన్ని పొందాడు. మళ్ళీ తిరిగి తాను 'సంసార సముద్రంలో మునిగిపోతానో? ఏమో?' అని భయపడ్డాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అతనిని చూచి "సద్గుణమనే దైవిక సంపదను కల పాండు పుత్రా'' అని సంబోధించి, ధార్మికుడు, మిక్కిలి గొప్పవాడైన పాండురాజుకు నీవు కుమారుడవు, ఆసుర స్వభావాన్ని కలవాడ కావు'' అని తెలియజేసి, భయాన్ని పోగొట్టాడు, ఆ తరువాత ఈ విధంగా పలికాడు,

(మత్తైయై నీ కుఱిక్కొళ్ ...ఇదనాల్ కాణ్) అందుచేత "ఇవి గ్రహించ దగినవి, ఇవి విడువదగినది" అని తెలిసికోవడానికి శాస్త్రమనే దీపం చాలా అవసరం. ధర్మశాస్త్రాలు, ఇతిహాసాలు, పురాణాలు, పెద్దల ఆచారం అనే వీటి సహాయంతో తెలియబడిన వేదాల ద్వారా భగవానుడనే పరతత్వాన్ని, ఆ స్వామిని ఆనందపరిచేవి, అతనిని పొందడానికి ఉపాయాలై యున్నవి, ఫలంలో సంగం లేకుండా చేయవలసినవి అయిన కర్మలను తెలిసికొని భక్తియోగాన్ని ఆచరించాలి.

ఈ విషయాలను శ్రీకృష్ణుడు పదహారవ అధ్యాయంలో అర్జునునకు తెలియజేశాడు.

## సప్తదశాధ్యాయసారవివరణం

18\. మఱ్ఱై పొరున్దాదవై వల్లశురర్క్కు వకుత్తమైయుమ్
మఱ్ఱై పొరున్దమ్ నిలైయుమ్ వన్కుణప్పడి మూవకైయుమ్
మఱ్ఱైనిలైతన్నై వకుక్కుమ్ కుఱి మూన్ఱిన్ మేన్మైమైయుమ్,
మఱ్ఱై యుమిழ్న్దానురైత్తాన్ వాశవన్ఱన్శిఱువనుక్కే ●

**వ్యాఖ్యానం:** ఈ గీతారూపమైన (అందమైన) వేదాన్ని వ్యక్తం చేసిన శ్రీకృష్ణుడు. ఇంద్రుని పుత్రుడైన అర్జునునకు - వేదరూపశాస్త్రానికి విపరీతాలైన కర్మలను గూర్చి, బలమైన ఆసురస్వభావాన్ని కలవారికి చెందినవిగా విభాగించి చెప్పబడిన వానినిగూర్చి, బలమైన సత్త్వగుణం మొదలైన మూడు గుణాలనుబట్టి శాస్త్రాలలో చెప్పబడిన కర్మానుష్ఠానంలోని మూడు విధాలైన స్వభావాలనుగూర్చి, వేదంలో విధింపబడిన కర్మానుష్ఠానాన్ని మిగిలినవాని కంటే వేఱుచేసి చూపే **"ఓమ్, తత్, సత్"** - అనే లక్షణాల గొప్పతనాన్ని గూర్చి ఉపదేశించాడు.

(మఱ్ఱై పొరుందాదవై ...వకుత్తమైయుమ్) వేదాలకు విపరీతంగా కొన్ని ఆగమాలు ఉన్నాయి. వాటిలో విధింపబడిన కర్మలను శాస్త్ర విరుద్ధాలని తెలియాలి. వేదంలో తెలుపబడిన కర్మలలో అధికారం లేని వారిచే దేశకాల ద్రవ్యప్రకారాలను అనుసరించాలనే నియమాన్ని పట్టించుకోకుండా, ఇష్టం వచ్చినట్లు చేయబడే కర్మలు వేద విరుద్ధాలు అవుతున్నాయి. ఇటువంటి కర్మలు అసుర ప్రవృత్తిని కల వారికే తగినవి. చాలా శ్రమతో, అహంకారం, దంభం, కామం, రాగం, బలం అనే వీటితో తమ దేహానికి, పరమాత్మ అంశ అయిన ఆత్మకు చాలా దుఃఖాన్ని కలిగించే యాగాదులను చేసేవారు అసుర ప్రవృత్తిని కలవారు. వారికి కొంచెం కూడా సుఖం లభించదు. నరకంలో పడి తపిస్తారు.

(మఱ్ఱై పొరుందుమ్...మూవకైయుమ్) యాగాలలో విధింపబడిన యాగము, తపస్సు, దానం అనే మూడిటిలో ఒక్కొక్కటి దానిని ఆచరించేవారికి సత్త్వం మొదలైన మూడు గుణాలలో ఒక్కొక్క గుణం అతిశయించి ఉండడాన్ని బట్టి మూడు విధాలుగా ఉంటుంది. ఈ విధంగా ఈ మూడు గుణాలలో

ఒక్కొక్క గుణం ఎక్కువగా ఉండడానికి కారణం అహంకారంలో ఉండే తేడాయే. అహంకారం సాత్వికం, రాజసం, తామసం అని మూడు విధాలు.

సత్వగుణం కలవారికి తీయదనంతో రసం కలిగినది, బలం మొదలైన వాటిని కలిగించి శరీరాన్ని చక్కని స్థితిలో ఉండేటట్లు చేసేది, చూసినప్పుడు సంతోషాన్ని కలిగించేది అయిన సాత్విక ఆహారము ఇష్టంగా ఉంటుంది. ఇటువంటి ఆహారం స్వీకరించడం వల్ల ఆయుస్సు, సత్వగుణం, జ్ఞానం, బలం, ఆరోగ్యం, సుఖం, ఆనందం అనేవి కలుగుతాయి.

రజోగుణం కలవారికి కారం, పులుపు, ఎక్కువ ఉప్పు కలిగినది, మిక్కిలి వేడిగా ఉన్నది, మిక్కిలి చల్లగా ఉన్నది, మిక్కిలి కటువుగా ఉండడం చేత ఉపయోగించడానికి వీలు లేనిది, ఆకలి కలగకుండా ఉండేటట్లు చాలా కఠినమైనది, అధికంగా పిత్తాన్ని కలిగించేది అయిన రాజసాహారం ఇష్టం అవుతుంది.

తమోగుణం కలవారికి కాలం తీరిపోయినది, సహజమైన రుచిని కోల్పోయినది, దుర్గంధాన్ని కలిగినది, కాలం తీరింది కావడంచేత రుచి మారినది, తండ్రి, ఆచార్యుడు, పెద్ద సోదరుడు అనే వీరి ఉచ్ఛిష్టం కాని ఎంగిలి, భగవంతునకు నివేదనం చేయకుండా ఉండేది, వైశ్వదేవం మొదలైన యజ్ఞాలలో ఉపయోగింపబడనిది అయిన తామసాహారమే మిక్కిలి ఇష్టంగా ఉంటుంది.

ఇటువంటి ఆహారాలకు తగినట్లు సత్వగుణం మొదలైన గుణాలు వృద్ధియై, వాటికి తగినట్లు ఆచరించే యాగం, తపస్సు, దానం అనే మూడు కర్మలు మూడు విధాలుగా ఉంటాయి.

సాత్విక యాగం అంటే - భగవంతుని ఆనందం తప్ప వేరొక ప్రయోజనాన్ని ఆశించని పెద్దలచే మనసులో ఏకాగ్రతతో శాస్త్రం తెలిపిన రీతిలో మంత్రం, ద్రవ్యం, క్రియ మొదలైన వానిని ఉపయోగించి, భగవంతుని ప్రీతీ కోసమే అని తలచి చేసే యాగం.

రాజస యాగం అంటే - ఫలాన్ని కోరి, కీర్తి లభించాలని తలచి ఆడంబరం కోసం చేసే యాగం .



తామస యాగం అంటే - మంచి ప్రవర్తన కల విద్వాంసులైన బ్రాహ్మణుల అనుమతిని పొందకుండా, నీచుల దగ్గరనుండి వస్తువులు మొదలైన వానిని సంపాదించి, చేసేటప్పుడు దక్షిణను సమర్పించకుండా శ్రద్ధ లేకుండా చేసే యాగము.

తపస్సు అనేది వాక్కు, శరీరం, మనసు అనే మూడు కరణాలతో చేయబడుతుంది గనక అది కూడా మూడు విధాలు.

శరీరంతో చేసే తపస్సు దైవ, బ్రాహ్మణ, గురు ప్రాజ్ఞులను గౌరవించడం, పుణ్యతీర్థ వాసం మొదలైనవి, మూడు కరణాలలో ఋజుత్వాన్ని కలిగి ఉండడం, స్త్రీలను కామ బుద్ధితో చూడకపోవడం మొదలైనవి, ప్రాణులను బాధించకపోవడం అనేవి.

వాక్కుతో చేసే తపస్సు ఏమంటే - ఇతరుల మనసు భయపడని విధంగా సత్యమైన, ప్రియమైన, హితాన్ని కలిగించే మాటనే పలకడం.

మనసుతో చేసే తపస్సు ఏమంటే - ఇతరులకు చెడ్డను కలగాలని భావించకపోవడం, మంచిని చేయాలని భావించడం, మనసుతో వాగ్వ్యాపారాలను నియంత్రించడం, ధ్యానించవలసిన వస్తువులలో మనసును నిలపడం, ఆత్మను తప్ప ఇక దేనిని చింతించకపోవడం అనేవి .

ఈ విధంగా మూడు కరణాలతో మూడు విధాలైన తపస్సులు ఏర్పడుతున్నాయి. అవి, సత్వం మొదలైన గుణాలను బట్టి మూడు విధాలుగా ఉంటాయి.

సాత్వికమైన తపస్సు అంటే - ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా "ఇది భగవంతుని ఆరాధనం" అని భావించి మిక్కిలి శ్రద్ధతో, శరీరం మొదలైన మూడు కారణాలతో చేసే తపస్సు.

రాజసమైన తపస్సు అంటే - ఇతరులు తమను మనసులో పొగడాలని, నోటితో కీర్తించాలని, శరీరంతో నమస్కరించాలని కోరి, ఒక ప్రయోజనాన్ని ఆశించి దంభం కోసం చేసే తపస్సు. ఈ తపస్సు నశించే స్వభావాన్ని కల స్వర్గం మొదలైన ఫలాలను ఇస్తుంది. ఆ ఫలాలను అనుభవించేటప్పుడు చేసిన కర్మ పూర్తి అగుటవలన మళ్ళీ కిందకు పడిపోతామేమో! అనే భయం కలుగుతుంది.

తామస తపస్సు అంటే - అవివేకులు తమ శక్తి, అధికారం మొదలైన వానిని గమనించి చూడకుండా, ఇతరులకు దుఃఖాన్ని కలిగించడం కోసం చేసే తపస్సు.

దానం కూడా ఈ విధంగానే మూడు విధాలుగా ఉంటుంది.

సాత్విక దానం అంటే స్వర్గం మొదలైన ఫలాలను కోరకుండా భగవంతుని ఆనందం కోసమే చేసే దానం. కులం, విద్య, శీలం అనే వీటివల్ల గొప్పవానికి "అతడు నాకు ఉపకారం చేస్తాడు" అనే భావంతో కాకుండా పుణ్యమైనచోట పుణ్యమైన కాలంలో దానం చేయడం.

రాజస దానం అంటే ప్రత్యుపకారం కోరి, ఫలాన్ని ఆశించి చేసే దానం. దానం చేసేటప్పుడు ఎక్కువగా దానం చేయకుండా, ఎక్కువగా దానం చేయడాని మనసు లేకుండా, ఎక్కువభాగం తనకే ఉంచుకుని చాలా తక్కువ దానం చేయడం.

తామస దానం అనగా - కళింగం మొదలైన తగని దేశాలలో, రాత్రి మొదలైన సమయాలలో, దొంగ, మూఢుడు, జూదరి మొదలైన తగని వారికి మర్యాద లేకుండా, ఉపచార వచనాలను పలుకకుండా, శాస్త్ర విశ్వాసం లేకుండా, పరలోక విషయంలో సందేహంతో దానం తీసుకునేవానికంటే తాను గొప్పవాడనని భావించి చేసే దానం.

(మైత్రేనిలై ...మేన్మైయుమ్) వేదంచేత విధింపబడిన యాగము, తపస్సు, దానం అనే కర్మలను 'ఓం, తత్, సత్' అనే మూడు శబ్దాలను ఉచ్చరించి ఆ తరువాత ఆచరించాలి.

వేదాలను ఆరంభించేటప్పుడు ఓంకారంతో ఆరంభించాలి. సర్గం మొదలైన ఫలాలను కానీ, మోక్షాన్ని కానీ ఆశించి చేసే వైదిక కర్మలు కూడా ఓంకార సంబంధాన్ని పొందడం చేత, వేదాలను ఉచ్చరించేవారు, ఆ వైదిక కర్మలను చేసి వారు అయిన త్రైవర్ణికులు ఓంకార సంబంధాన్ని పొందుతున్నారు.

తత్ అనే పదం బ్రహ్మ వాచకం. అన్య ఫలాపేక్ష లేకుండా మోక్షాన్ని కోరే అధికారులు వేదాధ్యయనం, యాగం, తపస్సు, దానం అనే వీటిని చేస్తారు, తత్ అనే పదానికి అర్థమైన బ్రహ్మాన్ని పొందడానికి ఆ కర్మలు సాధనాలు

కనుక, ఆ కర్మలు, ఆ కర్మలను తెలిపే వేదాలు, తత్ అనే పదంతో తెలుపబడుతున్నాయి. త్రైవర్ణికులు ఆ కర్మలను ఆచరించడం చేత, ఆ వేదాలను అనుసంధించడం చేత కూడా వారు 'తత్' అనే పదం యొక్క సంబంధాన్ని పొందుతున్నారు.

లోక మర్యాదలోనూ వైదిక మర్యాదలోను సత్ అనే పదం "ఉన్నది" అనే అర్థాన్ని, "మంగళమైన" అనే అర్థాన్ని ఇస్తుంది. లోకంలో ఒక మనుష్యుడు ఒక శుభకరమైన కార్యాన్ని "ఇది సత్కర్మ" అని చెప్పడం అలవాటు కదా. వేదాన్ని అధ్యయనం చేసే త్రైవర్ణికులు కూడా యాగం, తపస్సు, దానం అనే వీటిలో అభినివేశాన్ని పొంది ఉండే స్థితి గొప్పది కనుక, అది 'సత్' అని చెప్పబడుతున్నది. ఆ విధంగా అభినివేశాన్ని పొందే ఆ త్రైవర్ణికులు ముగ్గురు కూడా 'సత్' అనే పదంతో చెప్పబడుతున్నారు. వారు ఆచరించే యాగం మొదలైన కర్మలు కూడా 'సత్' అనే పదంతో చెప్పబడుతున్నది. వారిని ఆ విధంగా ఆ కర్మలలో ఆసక్తిని కలవారినిగా చేసే వేదాలు కూడా 'సత్' అనే పదంతో చెప్పబడుతున్నాయి. అందుచేత, బ్రాహ్మణులు మొదలైన త్రైవర్ణికులు, వేదాలు, కర్మలు అనే ఈ మూడు 'సత్' అనే పదం యొక్క సంబంధాన్ని పొందుతున్నారు.

ఈ విషయాలను అన్నిటిని శ్రీకృష్ణుడు అర్జునునకు 17వ అధ్యాయం లో బోధించాడు.

## అష్టాదశాధ్యాయసార వివరణం

19. శత్తువ వీడుడై నల్ కరుమమ్ తానుకన్దమైయుమ్
శత్తువముళ్ళదు తాన్ కుటిక్కొళ్ వకై శెయ్దదువుమ్
శత్తువ నల్కిరిశై ప్పయనుమ్ శరణాగతియుమ్
తత్తువమే తరువానురైత్తాన్ తనిప్పార్త్తనుక్కే ●

సత్త్వగుణాన్నే అనుగ్రహించే శ్రీకృష్ణుడు, సాటి లేని అర్జునునకు - సాత్త్వికత్యాగంతో కూడిన, గొప్ప, శాస్త్రీయాలైన కర్మలను గూర్చి ఈశ్వరుడైన తాను కోరిన స్వభావాన్ని గూర్చి, సాత్త్వికమైన కర్మను తాను (అతడు) పరిగ్రహించడానికి తగినట్లుగా కర్మలు సాత్త్విక రాజస తామస బేధాలతో మూడు విధాలుగా విభాగింపబడడాన్ని గూర్చి, సాత్త్వికాలైన గొప్ప కర్మల ఫలమైన ముక్తిని, ప్రపత్తిని గూర్చి ఉపదేశించాడు.

**వ్యాఖ్యానం:** (శత్తువవీడు...ఉకందమైయుమ్) కర్మలను చేతనులు ఆచరించేటప్పుడు కర్తృత్వాన్ని, మమతను, ఫలసంబంధాన్ని విడిచిపెట్టాలి. ఈ విధంగా విడిచిపెట్టే విధానం ఏమి? అంటే,

కర్తృత్వ త్యాగం అంటే - భగవంతుడు తానే తనకు దాసుడైన జీవుని పురస్కరించుకొని తన అధీనంలో ఉండే ఇంద్రియాలు, శరీరం, ప్రాణాలు అనే వీనితో తన లీలయే ప్రయోజనంగా తలచి, ఈ కర్మలను చేస్తున్నాడని భావించి చేయడం.

మమతా త్యాగం అనగా - జీవుడు తాను పొందాలని ఫలానికి సాధనంగా ఉండడం చేత తాను చేసే కర్మలు తనవిగా భావించకుండా, భగవంతుడే తన ఆనందంకోసమే ఈ కర్మలను తానే చేయిస్తున్నాడని భావించడం.

ఫలసంగరాహిత్యం అంటే - కర్మ వల్ల కలిగే సర్గం మొదలైన ఫలాలను తాను ఆశించకుండా ఫలంలో సంబంధాన్ని విడిచిపెట్టడం. ఫలానికి సాక్షాత్ కారణం భగవంతుని నిర్హేతుక కృపయే కనుక, కర్మలను ఫలానికి ఉపాయంగా గ్రహించకపోవడం అనే ఫలోపాయత్వత్యాగంకూడా ఇందులో చేరుతుంది.

అందుచేత ఈ విధంగా మూడు విధాల త్యాగాలతో కూడిన యజ్ఞ, దాన, తపస్సులు మొదలైన వైదికాలైన వర్ణాశ్రమ ధర్మాలను ఏ సమయంలోనూ విడిచిపెట్టకూడదు. ఈ కర్మలు భగవంతుని ఆరాధనా రూపాలు అని భావించి జీవితాంతం విధింపబడిన సమయాలలో తప్పక చేయాలి. వీనిని చేయకుండా విడిచి పెట్టినట్టయితే జీవనయాత్రయే సరిగా నడవదు. ఎందుకంటే, యాగం మొదలైన వైదిక కర్మలను చేసి, వాటి వలన పరిశుద్ధమైన అన్నాన్ని భుజిస్తే, మనసు తేట పడి, ఆ భగవానుని నిరంతరం చింతించి, ఆ తరువాత ముక్తిని పొందవచ్చు. ఆ విధంగా కాకుండా తన కడుపు నింపుకోవడమే ముఖ్య ప్రయోజనంగా భావించి భగవంతుని ఆరాధనలను చేయకుండా ఊరికే భుజించేవారు పాపాన్నే తింటున్నారు. అందువల్ల వారు విపరీత జ్ఞానాన్ని పొంది నశిస్తారు.

సాత్త్విక త్యాగం అంటే - సత్త్వగుణం ఎక్కువగా ఉండడం వల్ల శాస్త్రాల తాత్పర్యాన్ని తెలిసికొని, నిత్య నైమిత్తికాది వర్ణాశ్రమ ధర్మాలను భగవంతుని ఆరాధన రూపాలుగా భావించి, పూర్వం తెలిపిన విధంగా కర్తృత్వ, మమతా, ఫల సంబంధరహితంగా కర్మలను ఫలాలకు ఉపాయాలని భావించకుండా చేయడం. ఇటువంటి సాత్త్విక యాగంతో పూర్వం తెలిపినట్లు చేయబడే కర్మలే భగవంతుని మనసుకు ఆనందాన్ని కలిగిస్తాయి.

రాజస త్యాగం అంటే - కర్మలు ఒకదాని తర్వాత ఇంకొకటి మోక్షాన్ని ఇవ్వగలిగినవి అని తెలిసినా, కర్మలు అధర్మాల అవుతాయి అనే అజ్ఞానం, భ్రాంతి లేకపోయినా, అవి శ్రమపడి ద్రవ్యాలను సంపాదించి చేయవలసి ఉన్నది కనుక, శరీరం శ్రమ పడుతుందేమో అనే భయంతో జ్ఞానయోగం సులభం అని తలచి వర్ణాశ్రమ ధర్మాలను విడిచి పెట్టడం. ఈ త్యాగం రజోగుణం వల్ల కలుగుతుంది.

తామస త్యాగం అంటే - తమోగుణంవల్ల అజ్ఞానం తల ఎత్తి, నిత్య నైమిత్తిక భగవదారాధన రూపాలైన కర్మలను సంసార బంధాలను కలిగించేవి అని భ్రమించి, వాటిని చేయకుండా విడిచిపెట్టడం. ఈ రాజసతామస త్యాగాలు శాస్త్ర విరుద్ధాలు.



(శత్తువముళ్ళదు...శెయ్ దదుమ్) గుణాలను బట్టి కర్మలు కూడా మూడు విధాలు.

సాత్విక కర్మలు అంటే - వర్ణాశ్రమాలకు తగినట్లు పూర్వం తెలిపిన కర్తృత్వాదులను విడచి, దంభం కోసం కాకుండా, ఫలసంగం లేకుండా, తన కర్తవ్యం అని తలచి చేసే కర్మలు.

రాజస కర్మలు అంటే ఫలాన్ని కోరి ఎక్కువ శ్రమతో చేయవలసినవి. "ఈ కర్మలు నాచేతనే చేయబడుతున్నాయి" అనే అహంకారంతో చేయబడే కర్మలు.

తామస కర్మలు అంటే - కర్మలను ఆచరించేటప్పుడు మధ్యలో కలిగే దుఃఖాన్ని, ధన వ్యయాన్ని, తనకు ఇతరులకు కలిగే హింసను, కర్మలను చేసి ముగించడానికి 'తనకు సామర్థ్యం ఉన్నదా?' అనే విషయాన్ని యుక్తులతోనూ, శాస్త్రాలతోను విచారించి తెలుసుకోకుండా, కర్మలను భగవంతుడే చేయిస్తున్నాడు అని భావించకండా చేసే కార్యాలు.

అందుచేత మోక్షాన్ని పొందాలని అనుకునేవాడు రజోగుణాన్ని,

తమోగుణాన్ని విడిచిపెట్టి, సాత్త్విక గుణాన్ని కలిగి ఉండాలి అని తెలిపినట్లు అయినది.

(శత్తువ...పయనుమ్) ఈ విధంగా సాత్త్విక త్యాగంతో వర్ణాశ్రమ ధర్మాలను ఆచరించేటప్పుడు మధ్యలో వచ్చే ఇంద్రాది శబ్దాలతో ఇంద్రుడు మొదలైన అన్య దేవతలను ఆరాధించరాదు. ఇంద్రాది దేవతలకు అంతర్యామిగా ప్రకాశించే భగవంతుని మాత్రమే ఆరాధించాలి. ఈ విధంగా భగవంతుని ఆరాధిస్తే అతని అనుగ్రహం కలుగుతుంది. దానివల్ల ఆ స్వామిని చేరే తగిన మార్గం ఏర్పడుతుంది. ఒక్కొక్క సమయంలో శాస్త్రాలను అనుసరించి ఆచరించే కర్మయోగం చేత మనసు తేటపడి, ఆత్మతత్త్వానికి చెందిన స్వచ్ఛమైన జ్ఞానం పొందినవాడు లౌకిక విషయాలనుండి మనసును నివర్తింప చేసికొని యోగానికి తగినట్లు మనసు నిలుపుకోవాలి. తరువాత ఇంద్రియాలను జయించినవారిని కూడా కలత కలిగించే లౌకిక విషయాల నుండి పూర్తిగా దూరంగా ఉండాలి. ఆ విధంగా చేయడంవల్ల అతనిలో ఆశ, లౌకిక విషయాలను పొందే సమయంలో ఆటంకాలు ఏర్పడినప్పుడు కలిగే పగ, తమకు తామే నశిస్తాయి.

యోగాన్ని చేయడానికి ఏ విరోధం లేని చోట ఏకాంతమైన చోట ఉండాలి. అధికంగా భుజించకుండా, భుజించకుండా ఉండకుండా, పరిమితమైన ఆహారాన్ని తీసుకోవాలి. స్థిరమైన ఆసనంలో కూర్చోవాలి. 'ఓం'కారం మొదలైన మంత్రాలను తప్ప మిగిలిన వారిని అనుసంధించరాదు. భగవంతుని దివ్యమంగళ రూపాన్ని మనసులో భావించాలి. శరీరం పతనం చెందే వరకు ధ్యానంలోనే ఎల్లప్పుడు అభినివేశాన్ని కలిగి ఉండాలి. ధ్యానం చేసేటప్పుడు తాను ధ్యానించే వస్తువు తప్ప, మిగిలిన విషయాలలోని దోషాలను గమనించి తెలిసికొని వాటిలో ఆశ లేకుండా చేసుకోవాలి. అచేతనమైన వస్తువులపట్ల చేతన భావన అనే అహంకారం, అది వృద్ధి కావడానికి కారణమైన పూర్వ వాసన, వాటివల్ల కలిగే మదం, కామం, కోపం అనే వీటిని విడిచిపెట్టాలి. తనవి కాని వస్తువులలో తనవి అనే భావన ఐన మమకారాన్ని విడిచిపెట్టాలి.

ఈ విధంగా ఆత్మానుభవం మహాసుఖమని తలచి, ధ్యాన యోగం లోనే లగ్నమై ఉండేవాడు సంసార బంధం తీరి పరిశుద్ధమైన ఆత్మ స్వరూపాన్ని



దర్శిస్తాడు. భగవంతుడు తప్ప మిగిలిన బ్రహ్మ మొదలుకుని గడ్డిపరక వరకు ఉండే వస్తువులను అన్నిటిని తృణీకరించి, వాటిని విడిచి పెట్టి, ఆ భగవంతుని నిరంతరం అనుభవించడం అనే పరభక్తిని పొందుతాడు. ఈ పరభక్తి అనే భక్తియోగంతో సర్వేశ్వరుని దర్శించాలి అనే గొప్ప ఆర్తి కలిగితే, దానివల్ల ఆ భగవానుడు జీవునిపై దయ చూపి పరిపూర్ణ కటాక్షంతో అనుగ్రహిస్తాడు. ఈ కటాక్షానికి పరజ్ఞానం అని పేరు. ఈ పరజ్ఞానం కలుగగానే మిక్కిలి దాహం కలవాడు అమృతమయమైన తటాకాన్ని చూచినట్టు ఇతనికి భగవంతుని సదా పూర్ణంగా అనుభవిస్తే కాని ప్రాణాలు నిలువ లేని స్థితి కలిగి, భగవంతుని గూర్చి గొంతెత్తి పిలుస్తాడు. ఈ స్థితికి పరమభక్తి అని పేరు. ఈ స్థితిలో ఉండే భక్తుని ఆర్తిని చూసిన భగవంతుడు చాలా తొందరగా అతనికి మోక్షానందాన్ని అనుగ్రహిస్తాడు. ఇదే సాత్వికత్యాగంతో పాటు చేసే

కర్మయోగం, అది ఫలం ఇచ్చే క్రమం.

ఈ విషయాలను అన్నిటిని శ్రీకృష్ణుడు అర్జునునకు పద్దెనిమిదవ అధ్యాయంలో బోధించాడు.

శ్రీకృష్ణుడు అర్జునునకు ఉపదేశించిన చరమ శ్లోకం లోని అర్థాన్ని ఈ విధంగా సంగ్రహంగా చెప్పవచ్చు.

జీవుడా!(అర్జునా!) నీ జ్ఞానం అత్యల్పం. శక్తి కూడా చాలా అల్పం. నీ జీవిత కాలం కూడా చాలా అల్పం. మోక్షాన్ని పొందడంలో నీవు ఆలస్యాన్ని సహించలేకుండా ఉన్నావు. ఈ శరణాగతి తప్ప మిగిలిన ఉపాయాలు అన్ని



నీవు తెలిసికొని ఆచరించడానికి సాధ్యం కానివి. అంతేకాక, ఆలస్యంగా ఫలాన్ని ఇస్తాయి. అందువల్ల నీవు వాటికోసం బాధపడకు. నేను అందరికీ సులభుడను. సకల లోకాలకు శరణమై ఉన్నాను. నీవు నన్ను మాత్రమే శరణంగా ఆశ్రయించు. నా విషయంలో అయిదు అంగాలతో కూడిన భరన్యాసాన్ని చేయి. ఆ విధంగా నీవు చేస్తే నీ కర్తవ్యాన్ని చేసిన వాడవవుతావు. నాకు మిక్కిలి ప్రియమైనవాడవు అవుతావు. నాకు నీ పట్ల ఉండే కరుణ అంతులేనిది. నీపై దయ చూపడడానికి నేను ముందుకు వస్తున్నాను. నా స్వాతంత్ర్యానికి అడ్డు లేదు. నా ప్రయత్నానికి ఫలాన్ని పొందే వాడను నేనే. నేను చేసే కార్యానికి నా సంకల్పం ఒకటే సహాయం. నీకు ఉండే విరోధివర్గం చాలా బలమైనది. అనేక విధాలైనది. దానిని నశింపచేసికోవడం నీ వల్ల కాదు. దానిని నేను నశింపజేస్తాను. ఇకపై నిలచి ఉండదు. నన్ను, నాకు చెందినవానిని అన్నిటిని నీకు అనుభవించడానికి అనుగ్రహించి, నిన్ను నాతో సమానంగా భోగాన్ని కలిగినవానినిగా చేస్తాను. ఈ విధంగా పూర్తిగా నీవు నన్ను అనుభవిస్తే, దానికి వ్యక్తీకరణ రూపంగా అంతటా, ఎల్లప్పుడూ, ఏ స్థితిలోనూ నాకు కైంకర్యం చేసే స్థితిని నీకు అనుగ్రహిస్తాను. ఇక నీవు దేనికి విచారపడవద్దు.

## ఫలశ్రుతి

★20. వన్పఱ్ఱుఱుక్కు మరున్దెన్ఱు మాయవన్ తానురైత్త
ఇన్బక్కడలముదా మెన నిన్ఱ ఇక్కీతైతనై
అన్బర్కురైప్పవర్ కేట్పవర్ ఆదరిత్తోతుమవర్
తున్బక్కడలిల్ తుళఙ్గై నీజి త్తులఙ్గువరే ●

"దృఢమైన సంసారబంధాన్ని ఛేదించే మందు ఇది" - అని ఆశ్చర్యకర లీలలను కల శ్రీకృష్ణుడు పల్కినది, మహాభారతమనే ఆనందసముద్రంలోని అమృతం అనేటట్లుగా ఉన్నది. స్థిరంగా నిలచి ఉండేదైన ఈ గీతను తమను ప్రీతితో ఆశ్రయించినవారికి ఉపదేశించే ఆచార్యులు, ఆ ఉపదేశాలను వినేవారు, వాటిలో ఆదరాన్ని కలవారు సంసారమనే దుఃఖసముద్రంలో పడి పరిభ్రమించ కుండా ప్రకాశిస్తారు.

**వ్యాఖ్యానం:** భగవదీత్గ, సంసారంలో పరిభ్రమించే జీవులను ఆ సంసార బంధం నుండి విడిపించే గొప్ప మందు అని భగవంతుడు స్వయంగా చెప్పిన గొప్పతనాన్ని కలిగినది, సకల ధర్మసూక్ష్మాలను తనలో కలిగిన కలిగినది, పఠించేవారికి ఆనందాన్ని కలిగించేది అయిన భారతం ఒక మహా సముద్రం. భగవద్గీత ఆ సముద్రంలో పుట్టిన సాటిలేని అమృతం. ఇటువంటి గొప్పతనాన్ని కల ఈ భగవద్గీతను తనను ఆశ్రయించిన శిష్యులకు ఉపదేశించే ఆచార్యులు, ఆ ఆచార్యులనుండి తెలిసికొనే శిష్యులు, మిక్కిలి భక్తి శ్రద్ధలతో దీనిని అధ్యయనం చేసే అందరూ సంసార సముద్ర నుండి బయటపడి తరిస్తారు.

## ప్రబంధసమాప్తి

★21. తీద*ற்ற* నఙ్కుణప్పాఙ్కడల్ తామరై చ్చెమ్మలర్మేల్
మాదు*ற்ற* మార్వన్ మరువ ఇన్కీతైయిన్ వణ్పొరుళై
క్కోద*ற்ற* నాన్మఱైమౌలియినాశిరియన్ కుఱిత్తాన్
కాదల్ తుణివుడైయార్ కఱ్కుమ్ వణ్ణమ్ కరుత్తుడనే ●

లక్ష్మీదేవి దోషం లేనిది, గొప్ప గుణాలను కల్గినది, క్షీరాబ్ధిలో పుట్టినది, ఎఱ్ఱని తామరపూవుపై వేంచేసి ఉండేది. ఆమె నిలచి ఉండే వక్షస్సును కలవాడైన శ్రీకృష్ణుడు భగవద్గీతను పలికాడు. మహాత్ములు అంగీకరించేటట్లుగా భోగ్యమైన ఆ భగవద్గీత లోని అందమైన తాత్పర్యాన్ని - భక్తిని, మహావిశ్వాసమనే అంగాన్ని ముఖ్యంగా కల్గినవారై, ప్రపత్తిని అనుష్ఠించినవారు శ్రద్ధతో అభ్యసించి తెలిసేటట్లుగా ఏ దోషం లేని, నాల్గు వేదాలను తెలిసిన ఆచార్యులైన వేదాంతాచార్యులు (దేశికులు) ఉపదేశించారు.

**వ్యాఖ్యానం:** శ్రీమన్నారాయణుని మనసు చల్లబడే విధంగా భగవద్గీతలోని తాత్పర్యాన్ని భక్తులు అందరూ భక్తితో శ్రద్ధతో పఠించి తెలిసికొనేటట్లు ప్రబంధంలో వేదాంతాచార్యులు అనే పేరు గల నేను వ్యక్తం చేశాను.

గీతలో 18 అధ్యాయాలలో శ్రీకృష్ణుడు అర్జునునకు ఉపదేశం చేసి చివరిగా ఈ విధంగా అన్నాడు. "అర్జునా! నేను ఉపదేశించిన పరమ రహస్యమైన ఈ గీతా శాస్త్రాన్ని తపస్సు చేయనివానికి నీవు ఉపదేశించకు. తపస్సు చేసినా, నీ విషయంలో, నా విషయంలో భక్తి లేనివానికి ఉపదేశించకు. భక్తి ఉన్నప్పటికీ వినాలనే ఆశలేని వానికి ఉపదేశించి వద్దు. అన్ని యోగ్యతలు ఉన్నా నా స్వరూపాన్ని, ఈశ్వర త్వాన్ని, నా గుణాలను విని, వాటి విషయంలో అసూయతో దోషాన్ని పలికేవారికి ఏ విధంగానూ ఉపదేశించకూడదు.

నా విషయంలో నిజమైన భక్తి కలవారికి ఉపదేశించేవాడు పరభక్తిని పొంది చివరకు నన్నే చేరగలడు అనే విషయంలో సందేహం లేదు. మానవులలో అతనికంటే ఎక్కువ ఇష్టమైన కృత్యాన్ని చేసినవాడు ఇంకొకడు ఎవడూ లేడు.

ఉండబోడు కూడా. సకల ధర్మాలను తెలిపే మన సంభాషణ రూపమైన ఈ భగవద్గీతను ఎవరైనా అధ్యయనం చేస్తే, నన్ను అనుసంధించడం అనే జ్ఞానయజ్ఞంవల్ల కలిగే ఆనందాన్ని పొందుతారు. ఈ గ్రంథాన్ని శ్రద్ధగా, అసూయ లేకుండా అధ్యయనం చేయాలి. ఇందుకోసం ఒక ఆచార్యుని ఆశ్రయించి, అతని పాదాలకు సేవ చేయాలి. మనసులో కలిగే సందేహాలను ఆ ఆచార్యుని వద్ద అడిగి తెలుసుకోవాలి. మిక్కిలి శ్రద్ధతో ఆ ఆచార్యునకు చిరకాలం సేవ చేయాలి. ఆ సేవతో ఆనందించిన ఆ ఆచార్యుని వద్ద ఈ గీతను అధ్యయనం చేయాలి. ఈ విధంగా చేసేవారు భక్తికి అడ్డుగా ఉండే కర్మలు అన్నిటి నుండి విముక్తులై పుణ్యాత్ములైన నా భక్తుల సమూహంతో చేరి, భక్తి యోగాన్ని ఉపదేశంగా పొంది, దానిని ఆచరించి మోక్షాన్ని పొందుతారు. అర్జునా! నేను పలికిన ఈ గతా శాస్త్రాన్ని నీవు చాలా జాగ్రత్తగా విని, ఇందులోని అర్థాలను గ్రహించావు కదా. ఇంతకుముందు అజ్ఞానం వల్ల యుద్ధం చేయను అని అన్నావు. ఆ అజ్ఞానం తీరిపోయిందా?"

ఈ విధంగా కృష్ణుడు పలికిన ఈ మాటలను విని అర్జునుడు ఈ క్రింది విధంగా వినయంగా సమాధానం పలికాడు. "స్వామీ కృష్ణా! అచ్యుతా! నీ దయవల్ల నా విపరీత జ్ఞానం పోయింది. శరీరమే ఆత్మ అని తలచే మోహం నశించింది. నిత్య నైమిత్తిక కర్మలు నీ ఆరాధనా రూపాలు. అందువల్ల అవి నిన్ను చేరడానికి పరంపరా కారణాలు. వాటిని సంసార బంధానికి కలిగిస్తాయని భావించిన నా అజ్ఞానం తీరింది. ఈ విధంగా నా అన్ని మోహాలు నీ దయవల్ల నశించాయి.

నీ దయవల్ల నిజాన్ని గుర్తించాను. జీవాత్మ స్వయంప్రకాశుడై ఉండడం మొదలైన స్వభావాల వల్ల అచేతనం కంటే వేరని, పరిణామం మొదలైనవి అతనికి లేకపోవడం చేత ప్రకృతి స్వభావాలను పొందనివాడని, జ్ఞానానికి ఆశ్రయమని, పరమ పురుషునకు శేషమని, నీచే నియమింపబడేవాడని, తెలిసికొన్నాను. అన్ని లోకాలను సృష్టించి, రక్షించి, నశింప చేయడం లీలగా కలవాడవై, ఏ దోషం లేని వాడవై, దివ్య మంగళ రూపాన్ని కలవాడవై, సహజంగానే



అంతులేని జ్ఞానం, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు, శక్తి మొదలైన అన్ని కళ్యాణ గుణాలను కలవాడవై, పరబ్రహ్మం అనే పేరుతో పిలువబడేవాడవై, పరమపురుషుడవై ఉండే నీ యథార్థమైన స్థితిని తెలిసికొన్నాను. పరతత్వం, అవరతత్వం అనే వీటికి సంబంధించిన యథార్థ జ్ఞానాన్ని పొంది, దానివలన ప్రతిదినం అభివృద్ధి అవుతున్నది. పరమ పురుషుడవైన నీ ప్రీతిని ఫలంగా

కల నిత్య నైమిత్తిక కర్మలను ఆచరించడం చేత, శాస్త్రాలలో నిషేధింపబడిన కర్మలను విడవడం చేత, ఇంద్రియ నిగ్రహంచేత పొందదగిన భక్తి యోగమనే ఉపాసనతో మాత్రమే పొందదగినవాడవు, సకల వేదాంతవేద్యుడవు, పరమ పురుషుడవు వసుదేవ కుమారుడవైన నీవే అనే జ్ఞానాన్ని కూడా పొందాను. దానివల్ల బంధువుల పట్ల నాకు ఉండే ప్రేమ చేత, కరుణవల్ల, అభివృద్ధి చెందిన విపరీత జ్ఞానం వల్ల నాకు కలిగిన మనోవ్యాకులత, సందేహం తీరిపోయి, యథార్థమైన జ్ఞానాన్ని పొందాను. ఇప్పుడే యుద్ధం నుండి భక్తియోగం వరకు గల కర్తవ్యాలను నిర్వహించి నీ ఆజ్ఞ నెరవేరుస్తాను'' అని అర్జునుడు విన్నవించాడు.

**అడివరవు - కరుమముమ్, ఉకవై, ఉడలమ్, శజ్గమ్, పిఱవామై, కణ్డెళితు, యోకమ్, తానిష్ట, ఆరాత శెల్వమ్, తన్మేన్మై, ఎల్లైయిల్.**

**ఎల్లైయిల్, ఎల్లామ్, తన్కழల్, ఊనిన్పడి, ముక్కుణమే, మూవెట్టిన్ ఆణై, మత్తై పొరున్దా, శత్తువ, వన్పఱ్ఱు, తీతఱ్ఱ, అరుళ్ తరుమ్.**

## గీతార్థ సంగ్రహ వివరణం సంపూర్ణం

